మీరు చదువుతున్నారా?

26 సంవత్సరాలకు పైగా
సినీ పరిశ్రమకు
ప్రేక్షక పాఠకులకు మధ్య వారధిగా
నిలిచి, యిటు పరిశ్రమలోనూ,
అటు ప్రేక్షకులలోనూ
ఉత్తమాభిరుచులను
పెంపొందించడంలో
కృషిచేస్తున్న

ఏకైక మాసపత్రిక

# విజయచిత్ర








చందమామ విజయా
కంబైన్స్

నాగిరెడ్డి - చక్రపాణి
ఆశీస్సులతో

# బృందావనం

సింగీతం శ్రీనివాసరావు

నిర్మాత
బి.వెంకట్రామిరెడ్డి

డి.వి.నరసరాజు

మాధవపెద్ది సురేష్

ప్రపంచంలోని మహత్తరమైన
గన్ యొక్క సజీవ ప్రతిరూపాన్ని
ఇప్పుడు మీ అబ్బాయికి యివ్వండి!



పెద్దవాడైన మీ చిన్నారి బాబుకు ఇకమీదట బొమ్మలు అవసరం లేదు. ప్రపంచంలోని విశిష్టమైన తుపాకీ యొక్క నిజమైన థ్రిల్‌ను మీ అబ్బాయికి చవిచూపండి.

ట్రు-గన్. ఇజ్రేల్ దేశపు శ్రేష్ఠమైన కమాండో యూనిట్ 'మొస్సాద్' రూపొందించిన UZI సబ్‌మెషిన్ గన్‌కు సజీవ ప్రతిరూపం.

అనుభూతి, నిర్మాణంలో పరిపూర్ణత, సైజు, ఆకారం, ధ్వని - వీటన్నిటిలోను ట్రు-గన్ అసలును పోలివుంటుంది. ట్రిగ్గర్‌ను లాగేంతవరకూ - అసలుకు, దీనికీ గల తేడా ఏమిటో మీరు చెప్పలేరు!

- శక్తివంతమైన జెట్ ద్వారా నీటిని వేగంగా చిమ్ముతుంది
- అతి వేగంగా, నిరాటంకంగా ప్రేల్చవచ్చును
- పగిలిపోని ఉన్నతస్థాయి ప్లాస్టిక్




- పదునైన అంచులు, లోహపు తునకలూ లేనిది
- నలుపు, ఆలివ్ గ్రీన్, మెటాలిక్ సిల్వర్ రంగులలో లభిస్తుంది

సరికొత్త

# Tru-Gun

**U.Z.I. సబ్ మెషిన్ గన్**

వినోదం దట్టించబడిన సజీవమైన గన్



ఢమ్మనిపించే ప్రత్యేక పరిచయపూర్వక తగ్గింపు!

ఈ కూపన్‌ను కత్తిరించి, మీరు ఎప్పుడూ అభిమానించే బొమ్మల దుకాణానికి మాల్ చేస్తే ట్రు-గన్ U.Z.I సబ్ మెషిన్ గన్‌పై 5% తగ్గింపు లభ్యమౌతుంది!

పేరు : ________________

వయసు : ________ తరగతి : ________

చిరునామా : ________________

________________

సినిమా అభిమానుల అభిమాన పత్రిక

# విజయచిత్ర



ఫిబ్రవరి '93 సంచిక ఆకర్షణలు

- వినోద్‌కుమార్ సమాధానాలు
- చిలగ్గల్ల పెళ్ళి సందడి
- రూపిణి గృహజీవితం
- మధ్య పేజీలలో ఐశ్వర్య
- ప్రముఖతారలు చెప్పిన '92 విశేషాలు
- మరెన్నో ఆకర్షణీయమైన శీర్షికలు

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి    సంచాలకుడు : చక్రపాణి


## ప్రకృతి నియమాలను పాటిద్దాం!

ప్రకృతి నియమాలను అనుసరించి నడుచుకోవాలని పెద్దలు తరచూ చెబుతూ ఉంటారు. అసలు ప్రకృతి నియమాలు అంటే ఏమిటి? మన చుట్టూ వున్న చరాచరాత్మకమైన ప్రకృతిలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క నిర్దిష్టలక్షణం ఉంటుంది. ఉదాహరణకు ఆకాశం నీలంగా కనిపిస్తుంది. దానికి ఆ రంగును కల్పించిన వారెవ్వరు? సూర్యుడు వేడిగానూ, చంద్రుడు చల్లగానూ ఎందుకు ఉంటారు? వేడిగా ఉన్న సూర్యరశ్మి, చంద్రుడిమీద పడి భూమిని చేరేలోగా చల్లని వెన్నెలగా ఎలా మారుతుంది? నక్షత్రాలు ఎందుకు ఎప్పుడూ మెరుస్తుంటాయి? రకరకాల పువ్వులకు వింత వింత రంగులు అద్దే వారెవ్వరు? నెమలికి నాట్యం, కోయిలకు పాట, సాలీడుకు గూడుకట్టే కళ నేర్పినవారెవ్వరు? కాలచక్రాన్ని గతి తప్పకుండా తిప్పేదెవ్వరు? ఇటువంటి ప్రశ్నలు అనంతాలు. వీటికి సమాధానాలు కూడా రకరకాలుగా ఉంటాయి. వీటన్నిటినీ సృష్టికర్తఅయిన భగవంతుడి వరప్రసాదాలుగా కొందరు విశ్వసిస్తారు. ఇవన్నీ ప్రకృతి సిద్ధంగా జరిగే కృత్యాలనీ, వీటిని మార్చలేమనీ విజ్ఞానశాస్త్రవేత్తలు వివరిస్తారు. నిగూఢమైన ప్రకృతి రహస్యాలను తెలుసుకునే ప్రయత్నాలు ఇప్పుడూ కొనసాగుతూనే ఉన్నాయి!

మన చుట్టూ ఉన్న ప్రకృతిలోనే కాదు; మన శరీరం లోపల కూడా ఈ నియమం స్పష్టంగా కనిపిస్తుంది. మన శరీరంలోని అవయవాలన్నీ వాటి పనులను క్రమం తప్పకుండా చేస్తూ ఉంటాయి. ప్రకృతి నియమాలకు విరుద్ధంగా నడుచుకున్నట్టయితే, అంతా తారుమారై అనారోగ్యానికి గురికావలసి వస్తుంది. జీవరాశులన్నిటికీ సుఖశాంతులు కలిగే మార్గాలను ప్రకృతి చూపుతున్నది. ఆ ప్రకృతి ధర్మాలను ఉల్లంఘించకుండా మన జీవితాలను మలుచుకోవడం సర్వవిధాలా శ్రేయస్కరం!


సంపుటి 91    ఫిబ్రవరి '93    సంచిక : 2

విడిప్రతి : 4.00    సంవత్సర చందా : 48.00




# చందమామకు జాతీయ పురస్కారం

నూతన సంవత్సర కానుకగా మీ అభిమానపత్రిక చందమామకు ఒక జాతీయ పురస్కారం లభించింది. అది, మహారాష్ట్రలోని ఇఛల్‌కరంజీ, ఎఫ్.ఐ.ఇ. ఫౌండేషన్ వారి ప్రతిష్ఠాత్మకమైన నేషనల్ అవార్డు. ఈ అవార్డు కింద ఒక ట్రోఫీ, 25,000 రూపాయలు బహుమతీ, డిసెంబర్ 27వ తేదీ వైభవంగా జరిగిన ఉత్సవంలో అందజేశారు.

ఈ సందర్భంగా ఇచ్చిన ప్రశంసాపత్రంలో ఇలా పేర్కొన్నారు :

"చందమామ పిల్లలకూ, వారి తల్లితండ్రులకూ ప్రియతమ పత్రికగా నెలనెలా వెలువడుతూ, వారి కుటుంబాలలోనూ, జీవితంలోనూ విడదీయరాని అనుబంధంగా పెనవేసుకున్నది. పిల్లల పట్ల కన్నవారి కర్తవ్యనిర్వహణలో ఒక భాగంగా కీ.శే. శ్రీచక్రపాణిగారు ఉదాత్త ఆశయంతో— నూతనమూ, ప్రయోజనాత్మకమూ అయిన పద్ధతిలో ఒక ఉద్యమం లాగా పిల్లల కోసం ఒక పత్రికను తీసుకురావడానికి ప్రణాళికను రూపొందించారు. 1947వ సం॥లో ఇప్పటి సంచాలకులు శ్రీబి.నాగిరెడ్డిగారు, ఆ ఉదాత్త ఆశయానికి రూపకల్పన ఇవ్వడానికి సేవాతత్పరతతో, ఉత్సాహంతో పూనుకున్నారు. దాని ఫలితంగా ఈనాడు చందమామ 12 భాషలలో వెలువడుతూ, అంధులకోసం బ్రైల్ ఎడిషన్‌గాకూడా ప్రచురింపబడుతున్నది.

"పిల్లలనూ, స్త్రీలనూ విద్యావంతుల్ని చేయడానికి, చందమామ వేలకొలది కథలూ, సీరియల్స్, పురాణ ఇతిహాసాలూ, జానపద కథలూ, జీవితచరిత్రలూ వెలువరించింది. ప్రాంతం, భాష వేరయినప్పటికీ మనదేశంలోని యువతరం అంతా ఒక్కటేననీ, వారి అభిరుచులూ, ఆశయాలూ ఒక్కటేననీ చందమామ విశ్వసిస్తున్నది. మనదేశంలోని వివిధ ప్రాంతాల జీవన స్థితిగతులలో తేడాలు ఉన్నప్పటికీ, మనదేశ యువత ఆలోచనా విధానంలో ఐకమత్యాన్ని ఏర్పరచి దాని ద్వారా జాతీయ సమైక్యతను సాధించ వచ్చని భావిస్తూ, చందమామ అందుకోసం కృషి చేస్తున్నది."

ఎఫ్.ఐ.ఇ. ఫౌండేషన్ అనే ఈ సంస్థ గత రెండు దశాబ్దాలుగా విజ్ఞాన, సాంకేతిక, వ్యవసాయ, వ్యాపార రంగాలలోనూ, కళ, సాంస్కృతిక, క్రీడారంగాలలోనూ విశిష్టమైన కృషి చేసిన వారిని అభినందించి సత్కరిస్తున్నది. అటువంటి విశిష్టవ్యక్తుల కృషిని సమాజానికి తెలియజేస్తూ, జాతీయ సమైక్యతకు పాటుపడడం ఈ సంస్థ ఆశయం. నాలుగున్నర దశాబ్దాలుగా చందమామ చేస్తూన్న కృషిని ఎఫ్.ఐ.ఇ. ఫౌండేషన్ గుర్తించి అభినందించింది. వారికి హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము.

ఈ సందర్భంగా మా ఆనందాన్ని మా అభిమాన పాఠకులూ, శ్రేయోభిలాషులూ అయిన మీతో పంచుకుంటున్నాము.

బి. విశ్వనాథరెడ్డి
చందమామ పబ్లికేషన్స్

# నూతన అమెరికా అధ్యక్షుడు

BILL CLINTON



ఆర్కాన్సాస్ స్టేట్ మాజీ గవర్నర్, నలభై ఆరేళ్ళ బిల్‌క్లింటన్ అమెరికా 42వ అధ్యక్షుడుగా ఎన్నిక య్యాడు.

అధ్యక్షపదవికి గత నవంబర్ 3వ తేదీ జరిగిన ఎన్నికలలో ప్రెసిడెంట్ జార్జ్‌బుష్ మీద పోటీచేసి, క్లింటన్ విజయం సాధించాడు. యాభైఐదు శాతం ఓటర్లు అంటే దాదాపు 10 కోట్లమంది ఓటు హక్కును వినియో గించుకున్న ఆ ఎన్నికలలో బిల్‌క్లింటన్‌కు 44 శాతం ఓట్లూ, జార్జ్‌బుష్‌కు 39 శాతం ఓట్లూ, ఇండిపెండెంటు అభ్యర్థి రాస్‌పెరోట్‌కు 17 శాతం ఓట్లూ వచ్చాయి. ఇటీవలి కాలంలో మొట్టమొదటిసారిగా క్లింటన్ నాయ కత్వంలోనిడెమొక్రటిక్‌పార్టీ, 'వైట్‌హౌస్'లోనూ, యు.ఎస్. కాంగ్రెస్‌లోనూ ఆధిక్యతను సాధించింది.

ఇటీవలి అమెరికా చరిత్రలో డెమొక్రటిక్‌పార్టీ సరిగ్గా 16 సంవత్సరాలకొకసారి అధికారాన్ని చేపట్టడం చెప్పుకోతగ్గ విశేషం. 1960వ సం॥ లో జాన్ ఎఫ్. కెనడీ, 1976వ సం॥లో జిమ్మీకార్టర్, పదహారేళ్ళ తరవాత మళ్ళీ ఇప్పుడు 1992వ సం॥లో డెమొక్రటిక్ పార్టీ, రిపబ్లికన్‌ల నుంచి అధికారాన్ని చేజిక్కించుకున్నది.

జనవరి 20వ తేదీ అధ్యక్షపదవీ ప్రమాణ స్వీకారం చేసిన వెంటనే ప్రెసిడెంట్ క్లింటన్ మాట్లాడుతూ – తాను ఎన్నికలలో చేసిన వాగ్దానాలను నెరవేర్చగలనని దేశ ప్రజలకు హామీ ఇచ్చాడు. దిగజారుతున్న ఆర్థికస్థితిని బాగుచేసి, దేశ ఆర్థిక పురోగతికి దోహదం చేసే విధంగా ఆర్థిక విధానాలలో మార్పులు ప్రవేశపెట్టగలనని అన్నాడు. హఠాత్తుగా ఏదో అద్భుతాలు జరిగిపోతాయని ఆశించవద్దని తన దేశం 25 కోట్ల ప్రజలకు గుర్తుచేస్తూ, ప్రతి ఒక్కరికీ ఆరోగ్యరక్షణా, విద్యావకాశాలూ, విద్యార్థులకు సులభంగా తిరిగి చెల్లించే ఋణసౌకర్యాలూ కల్పించగలననీ, వాతావరణ కాలుష్యాన్ని నివారించడానికి పాటుపడ గలననీ ఆయన హామీ ఇచ్చాడు.

ఆమెరికా జీవన విధానంలో మార్పులు తీసుకురావాలని క్లింటన్ ప్రచారం చేశాడు. అదే అయన విజయానికి దోహదం చేసింది. "విభిన్న జాతులకూ, భాషలకూ నిలయం మనదేశం. ఈ భిన్నత్వం మనకూ, ప్రపంచానికీ బలం కావాలి కాని, బలహీనత కాకూడదు," అని ఆయన అన్నాడు. వేరొక సందర్భంలో క్లింటన్ ఇలా అన్నాడు: "మనదేశంలోని స్త్రీ

పురుషులందరూ, చిన్నా, పెద్దా తేడా లేకుండా, దేవుడిచ్చిన శక్తి సామర్థ్యాలను, పరిపూర్ణంగా సద్వినియోగం చేసుకుని సుఖ సంతోషాలతో జీవించాలన్నదే నా ఆశయం. దేశంలోని విభిన్న జాతులు, మనల్ని విడదీసి బాధలకు గురిచేయకూడదు. అవి మనకు బలం కావాలి!"



AL GORE

క్లింటన్ పుట్టడానికి రెండు నెలల ముందే అతని తండ్రి, విలియం జెఫర్సన్ బ్లైత్, కారు ప్రమాదంలో మరణించాడు. అతని తల్లి, రోజర్ క్లింటన్ అనే అతన్ని పెళ్లాడింది. క్లింటన్ ఉపకార వేతనాల మీద చదివాడు. వాషింగ్టన్‌లోని జార్జ్‌టౌన్ విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడయ్యాక, ప్రతిష్ఠాత్మకమైన 'రోడ్స్ స్కాలర్‌షిప్' మీద ఆక్స్‌ఫర్డ్‌విశ్వవిద్యాలయంలో చేరి తత్వం, రాజనీతి అధ్యయనం చేశాడు. ఆ పిమ్మట అమెరికాలోని యేల్ విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రం చదివాడు.

ఆయన యు.ఎస్. కాంగ్రెస్‌కు పోటీచేసిన ప్రథమ ప్రయత్నం విజయవంతం కాలేదు. రెండవసారి ఆర్కన్సాస్ అటర్నీ జనరల్‌గా ఎన్నికయ్యాడు. ఆ తరవాత గవర్నర్ అయ్యాడు. కాని, రెండవసారి ఓడిపోయాడు. రెండేళ్ళ తరవాత మళ్ళీ పోటీ చేసి విజయం సాధించాడు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం జన్మించిన మొట్టమొదటి అమెరికా అధ్యక్షుడు అన్న ప్రత్యేకత బిల్‌క్లింటన్‌కు ఉన్నది. యాభైయేళ్ళ వయసులోపుగా ఆ ఉన్నత పదవిని అలంకరించిన వారిలో ఆరవ వాడాయన. 1901వ సం॥లో థియోడోర్ రూజ్వెల్ట్ 42వ యేట అధ్యక్షుడయ్యాడు.

క్లింటన్‌భార్య, హిల్లరీ క్లింటన్ అమెరికాలో ప్రసిద్ధురాలైనలాయర్.ఆమెబాలల హక్కుల కోసం కృషి చేస్తున్నది. క్లింటన్ దంపతుల ఏకైక కుమార్తె పన్నెండేళ్ళ చెల్సీ, పబ్లిక్ స్కూలులో చదువుకుంటున్నది.

అమెరికా ఉపాధ్యక్షుడుగా ఎన్నికయిన ఎల్‌గోర్, క్లింటన్‌కన్నా రెండేళ్ళు చిన్నవాడు. వాతావరణ పరిరక్షణకోసం కృషిచేస్తున్న ఆయన, రియోడిజనీరోలో జరిగిన భూపరిరక్షణశిఖరాగ్రసమావేశాలలోపాల్గొన్నఅమెరికా బృందానికి నాయకత్వం వహించాడు.

బిల్ క్లింటన్ గురించిన మరికొన్ని విశేషాలు:

* ఆయనకు క్రీడలంటే అభిమానం. గోల్ఫ్ ఆట అభిమాన క్రీడ.
* సినిమాలన్నా, 'స్పైథ్రిల్లర్స్' అన్నా ఎంతో ఇష్టం.
* ఐస్‌క్రీమ్స్, మామిడి చట్నీ అంటే మక్కువ.
* 'ప్రచ్ఛన్నయుద్ధం' తరవాతి సవాళ్ళను ఎదుర్కోవడానికి దేశ ప్రజలందరి దృష్టినీ కేంద్రీకరింప చేయాలన్నది ఆయన ఆశయం.




# ఇద్దరు వైద్యులు

అవంతీ నగరాన్ని పాలించే అనంగపాలుడి గజబలంలో, శర్వాణి అనే ప్రసిద్ధికెక్కిన మదపుటేనుగు వుండేది. అనంగపాలుడికి ఆ ఏనుగుపట్ల ఎక్కువ మక్కువ. దాన్ని అధిరోహించి ఆయన అనేక యుద్ధాల్లో విజయుడు కావడమే అందుకు కారణం.

ఒకనాడు అనంగపాలుడు, శర్వాణి మీద సుఖాసీనుడై, నగరం వెలుపలగల ఉద్యాన వనానికి విహారానికి బయలుదేరాడు. ఉద్యానవనందరిదాపుల్లో వుండనగా, శర్వాణి వున్నట్టుండి ప్రళయకాల ఝంఝామారుతం లాగా పెద్దగా ఘీంకారం చేస్తూ, నాలుగు కాళ్ళ మీదా చతికిలబడిపోయింది.

అనంగపాలుడు అంబారీలోంచి కిందికి దుమికి, ఏనుగుకు ఏమయిందో చూడమని, మావటివాణ్ణి ఆజ్ఞాపించాడు. శర్వాణికి అంత అర్ధాంతరంగా ఏమి ముంచుకు వచ్చిందో వాడికి అంతుపట్ట లేదు. రాజు పశుపక్ష్యాదులకు కూడా వైద్యం చెయ్యడంలో సిద్ధహస్తుడనిపించుకున్న, రాజ వైద్యుడు శివశర్మను పిలిపించాడు.

శివశర్మ, ఏనుగును పరీక్షించి అనంగపాలుడితో, "మహారాజా, ఇది ప్రాణులన్నిటికీ చాలా అరుదుగా వచ్చే, సర్వాంగ కుంచితం అనే మహావాతమని, నాకనిపిస్తున్నది. ఈ వ్యాధి వచ్చిన జీవి బతకడం అన్నది అసాధ్యం. ఈమధ్య నేను ఒక ప్రాచీన వైద్యగ్రంథంలో దీనికి చికిత్స వివరించి వుండడాన్ని చూశాను. కాని అది విశేషమైన వ్యయప్రయాసలతో కూడినపని," అన్నాడు.

"ఈ ఏనుగు కోలుకుని తిరగడం, నాకు ముఖ్యం. ఆచికిత్స ఏదో ప్రారంభించండి," అన్నాడు అనంగపాలుడు.

శివశర్మ ఆప్రదేశంలో డేరాలు వేయించి, అక్కడే విడిది ఏర్పాటు చేసుకుని, ఏనుగుకు చికిత్స మొదలుపెట్టాడు. ఆయన అరుదైన

సాయిరాంప్రసాద్

వనమూలికలూ, రకరకాల కాయధాన్యాలూ తెప్పించి లేహ్యాలూ, అవలేహ్యాలూ తయారు చేస్తూ, వాటితో ఎంతో శ్రద్ధగా ఏనుగుకు వైద్యం చేయసాగాడు.

నెల రోజులు గడిచినా ఏనుగు శరీర స్థితిలో మార్పేమీ, రాజుకు కనిపించలేదు. అయితే, శివశర్మ మాత్రం ఆయనతో, "మహారాజా! పైకి కనబడకపోయినా, వైద్య ప్రభావంవల్ల ఏనుగులో వస్తున్న మార్పులు, వైద్యుణ్ణయిన నేను గుర్తించ గలుగుతున్నాను. మరికొద్ది రోజులలో ఇది మును పటిలాగా లేచి తిరగ గలదన్న నమ్మకం, నాకున్నది," అన్నాడు.

ఇది విని అనంగపాలుడు చిరాగ్గా ఏదో అనబోయేంతలో, అక్కడ చేరిన జనంలో నుంచి ఒక వ్యక్తి ముందుకు వచ్చి, "మహారాజా! ఇంతవరకూ జరిగిన చికిత్స వల్ల, ఏనుగుకు చెప్పుకోదగిన మేలు కలిగిందని, నేననుకోను. నాకు అవకాశం ఇప్పించా రంటే, దీని వ్యాధి నేను త్వరలో కుదర్చ గలను," అన్నాడు.

అనంగపాలుడు, ఆ వ్యక్తి కేసి చూశాడు. అతడు వినయంగా రాజుకు నమస్కరించి, "మహారాజా! నా పేరు జీవకదత్తుడు. నేనూ వైద్యుణ్ణే," అన్నాడు.

వెంటనే శివశర్మ కలుగ జేసుకుని, "ఇతడు కొన్నాళ్ళపాటు నా దగ్గర వైద్యం నేర్చుకునే ప్రయత్నం చేసి, నా చేత వైద్య వృత్తికి పనికిరాడని పంపబడ్డ వాడు," అన్నాడు.



అనంగపాలుడు కొంచెం సేపు ఆలో చించి, "'ఏ పుట్టలో ఏ పామున్నదో- ఇతడు చేయగలిగింది కూడా చూద్దాం," అని జీవకదత్తుడికి ఏనుగుకు చికిత్స చేసేం దుకు అనుమతి ఇచ్చాడు.

అప్పుడు జీవకదత్తుడు, రాజుతో, "ఈ ఏనుగు కంటికి ఆనేంత దగ్గిరలో, తటాకం ఒకటి తవ్వించండి, మహారాజా! దానినిండా తామరతూండ్లు తెప్పించి వేయించండి. తటాకం గట్ల చుట్టూ అందమైన చెట్లూ, పుష్పలతలూ నాటించండి," అన్నాడు ఎంతో వినయంగా.

అనంగపాలుడు ఆశ్చర్యపోయి, "ఇదేనా, నువ్వు చేయబోయే చికిత్స?" అని ప్రశ్నిం చాడు.

జీవకదత్తుడు అవునన్నట్టు తలవూపి, "కొద్ది రోజుల్లో తమరు ఆ చికిత్సా ఫలితాన్ని చూడగలరు," అని జవాబిచ్చాడు దృఢమైన స్వరంతో.

రాజు, జీవకదత్తుడు అడిగినట్టే వారం తిరక్కుండా పెద్ద తటాకం తవ్వించాడు. ఆ తర్వాత జీవకదత్తుడి కోరికపై, రోజూ గజశాల నుంచి కొన్ని ఏనుగులను మావటి వాళ్ళు, ఆ తటాకం నీటిలో స్నానం చేయించేం దుకు తోలుకు పోసాగారు.

ఇలా పది రోజులు గడిచాక, జీవక దత్తుడు, రాజును తటాకం దగ్గిరకు తీసుకు పోయాడు. అక్కడి దృశ్యం చూసి అనంగ పాలుడు తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు. తటాకంలో శర్వాణి ఇతర





ఏనుగులపై నీళ్ళు చిమ్ముతూ ఘీంకారాలు చేస్తున్నది.

"ఎలాంటి చికిత్స చేశావోగాని, శర్వాణి పూర్తిగా కోలుకున్నది. రేపు నిండు సభలో నిన్ను ఘనంగా సత్కరించదలిచాను, వచ్చి కనబడు!" అన్నాడు రాజు.

దాపుల వుండి ఇది విన్న శివశర్మ, "మహారాజా! కష్టపడి రాత్రింబవళ్ళు ఏనుగుకు వైద్యంచేసి స్వస్థత కలిగించిన వాణ్ణి, నేను! ఇన్నాళ్ళకు నేను వాడిన మందులు పనిచేసి, శర్వాణి మిగతా ఏనుగులతో తిరగ గలుగుతున్నది. ఇందులో జీవకదత్తుడు చేసినదేమీ లేదు. తమ సత్కారానికి అర్హుణ్ణి, నేను!" అన్నాడు.

జీవకదత్తుడు అందుకు ఒప్పుకోక, "నేను అవలంబించిన ప్రక్రియ వల్లనే ఏనుగుకు స్వస్థత చేకూరింది. శివశర్మ చేసిన చికిత్సవల్ల కాదు," అంటూ వాదనకు దిగాడు.

అనంగపాలుడు ఎటూ నిర్ణయించలేక, "సరే, మీరిద్దరూ రేపు సభకు రండి. మీ వివాదాన్ని పరిష్కరిస్తాను," అని చెప్పి వెళ్ళిపోయాడు.

మర్నాడు నిండు సభలో ఆయన వైద్యులు లేవదీసిన వివాదాన్ని ప్రస్తావించి, ఏనుగుకు స్వస్థత కలిగించినవాళ్ళు, ఆ ఇద్దరిలో ఎవరో చెప్పమని అడిగాడు.

ముందుగా సుబుద్ధి అనే మంత్రి, "మహారాజా! శివశర్మ ఇచ్చిన మందుల ప్రభావంవల్లనే, ఏనుగు లేచి తిరగ గలుగుతున్నదనడంలో సందేహం లేదు," అన్నాడు.

సుకీర్తి అనే మరొక మంత్రి, "మహారాజా! చచ్చినట్లుపడివున్న ఏనుగుకు ఉత్తేజం కలిగించడానికి, జీవకదత్తుడు కల్పించిన కొన్ని పరిస్థితుల వలన మాత్రమే, దాని వ్యాధి నయమయిందని, నాకనిపిస్తున్నది," అన్నాడు.

మంత్రులలోకెల్లా చిన్నవాడైన శశిధరుడు మాత్రం, "మహారాజా! వైద్యులిద్దరయినా, ఏనుగుకు జరిగిన చికిత్సను మాత్రం విడివిడిగాకాక, ఒకటిగానే చూడాలి! అందుచేత తమరు చేసే సన్మానానికి ఇద్దరూ అర్హులే.

నేనిలా ఎందుకంటున్నానో, ఒకసారి ఆలోచించి చూస్తే తమరికే అర్థమవుతుంది," అన్నాడు.

అనంగపాలుడు కొంచెం సేపు ఆలోచించి, "అవును, శశిధరుడన్నది అక్షరాలా నిజం. నేను వైద్యులిద్దరినీ సమానంగా సత్కరించ దలిచాను. ఎందుకంటే— ఈ సృష్టిలో వ్యాధిగ్రస్తమయ్యాక, ఆ ప్రాణి ఎటువంటిదైనా, దాని దేహానికే కాక, వ్యాధి కారణంగా అది కోల్పోయిన మనోనిబ్బరానికి కూడా చికిత్స జరగాలి. అలాకానప్పుడు, ఆ ప్రాణిలో జీవేచ్ఛ కలిగించడం సాధ్య పడదు. శివశర్మ, శర్వాణికి ప్రశస్తమైన వైద్యం చేశాడు. అందువల్ల మందుల ప్రభావం ఏనుగుపై ఏమీలేదనడం కన్నా, రోగపీడన వల్ల అది తన మనోబలాన్ని పూర్తిగా కోల్పోయిందనడం వాస్తవ మవుతుంది!" అన్నాడు.

ఇది విన్న మంత్రులతోపాటు సభికులు కూడా ఆనందంతో ఆమోదసూచకంగా తలలు ఊపారు.

అప్పుడు అనంగపాలుడు, "ఇక జీవకదత్తుడు ఏనుగుపై ప్రయోగించిన వైద్య ప్రక్రియ, దాని మనోబలాన్ని పెంచి జీవితం పట్ల ఉత్తేజం కలిగించడం గురించి. మిగతా ఏనుగులు తటాకంలో దిగి జలకాలాడుతూ ఉత్సాహం కొద్దీ చేసే ఘీంకారాలు, శర్వాణికి తనూ మందలో కలిసి తిరగాలనే తీవ్రమైన కోరికను కలిగించాయి. ఆ కారణంగానే అది చతికిల బడివున్న చోటు నుంచి లేచి, తటాకం నీటిలో దిగ గలిగింది. ఇందువల్ల, ఏనుగు దేహానికి చికిత్స చేసింది శివశర్మ అయితే, దాని మనోబలాన్ని పునరుద్ధరించడానికి సాయపడిన వాడు జీవకదత్తుడు. ఇదంతా, శశిధరుడు వైద్యుల చికిత్సను విడివిడిగా కాక, ఒకటిగానే చూడాలన్న తర్వాతే, నాకు స్ఫురించింది," అన్నాడు.

అంతా విన్న సభికులు హర్షధ్వానాలు చేశారు. అనంగపాలుడు, వైద్యులిద్దరినీ మెచ్చుకుని, వాళ్ళను ఘనంగా సన్మానించాడు.



# జబ్బు చెయ్యని వాళ్ళు

ఏదో పని మీద పట్నం వెళ్ళిన సోమయ్య, కాలినడకన తమ ఊరికి తిరిగి వస్తున్నాడు. దారిలో మరొక ఊరివాడైన పోలయ్య, తన గ్రామానికి వెళుతూ కనిపించాడు. ఇద్దరూ పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ నడక సాగించారు.

సోమయ్య వాగుడుకాయ. లేనిపోని గొప్పలు చెప్పుకోవడం, అతడికి వెన్నతో పెట్టిన విద్య. గ్రామాల్లోని రోగాలూ, రొష్ఠులూ గురించి మాట్లాడుకునే సందర్భంలో సోమయ్య, "మా ఊళ్ళో అసలెవరికీ ఏనాడూ జబ్బు చెయ్యదు తెలుసా?" అంటూ గొప్పగా చెప్పసాగాడు.

ఇది విని పోలయ్య ఆశ్చర్యపోయాడు. చివరకు ఇద్దరూ సోమయ్య వాళ్ళ ఊరు సమీపించారు. అక్కడ దారులు చీలే చోట పోలయ్య సెలవు తీసుకుంటూ, దాపులవున్న ఒక ఇంటి అరుగుమీద బాగా చిక్కి నీరసించిపోయి, ఖళ్ళు ఖళ్ళుమంటూ దగ్గుతున్న ఒక మనిషిని చూసి, సోమయ్యతో, "మీ ఊళ్ళో ఎవరికీ ఏనాడూ జబ్బు చెయ్యదన్నావు! మరి ఈయనెవరూ, ఇవ్వాలో రేపో పరలోకయాత్ర చేసేలా వున్నాడు?" అని అడిగాడు.

సోమయ్య ఖంగుతిని, అది కనిపించనీయకుండా తాపీగా, "అతనా! అతను మా ఊరి వైద్యుడు. ఊళ్ళో ఎవరికీ వైద్యం చెయ్యడానికి అవకాశం లేక, ఆదాయం లేక, తిండి లేక అలా చిక్కిశల్యమయ్యాడు. ఇప్పటికైనా నమ్మకం కలిగిందా, నే చెప్పింది నిజమని?" అన్నాడు.

-కోనే నాగవెంకట ఆంజనేయులు






[యువరాణి ప్రయాణానికి పల్లకీ సిద్ధంగా ఉన్నదని ద్వారపాలకుడి ద్వారా తెలుసుకున్న మహేంద్రనాథుడు, ఆ రాత్రే మాయాభవనం లోపలికి ప్రవేశించి, యువరాణి విద్యావతికి ఆ విషయం తెలియజేశాడు. యువరాణి అప్పటికప్పుడే మాయాభవనం వదిలి వెళ్ళడానికి సమ్మతించింది. ఇద్దరూ ఎంతో జాగ్రత్తగా మాయాభవనం నుంచి బయటపడ్డారు. —తరవాత]

వృద్ధస్త్రీ తెల్లవారుజామున లేచి, తన యజమాని మాట ప్రకారం, యువరాణి విద్యావతిని ప్రయాణానికి సిద్ధం చేయడానికి ఆమె గదిలోకి వెళ్ళింది. కాని, అక్కడ యువరాణి కనిపించలేదు. పక్క గదిలోకి వెళ్ళి చూసింది. ఆ గది తలుపులు కూడా తెరిచి ఉన్నవేగాని అక్కడ కూడా యువరాణి లేదు. అమితాశ్చర్యంతో వృద్ధస్త్రీ గదులన్నిటినీ వెతికింది. కిటికీల వద్ద చూసింది. ఎక్కడా యువరాణి జాడలేదు. పరిచారిక మాలిని గదిలోకి వెళ్ళింది. ఆ గది తలుపులు కూడా తెరిచే ఉన్నాయి. వృద్ధస్త్రీ కిందికి దిగి, ఉద్యానవనద్వారం దగ్గరికి వెళ్ళింది. ద్వారం తలుపులు తెరిచి ఉన్నాయి. అలాగే వెలుపలి ద్వారం దగ్గరికి వెళ్ళిచూసింది. ఆ తలుపులు మాత్రం మూసిఉన్నాయి. పెద్దతాళంవేలాడుతున్నది. ద్వారపాలకుడు లేడు. ఆమె వెనుతిరిగి



భవనం లోపలికి గబగబా నడిచింది. కొంతసేపట్లో పల్లకీ వస్తుంది. అందులో యువరాణిని జాగ్రత్తగా తీసుకుని, తనను పల్లకీవెంట తోడుగా రమ్మని యజమాని నిన్న ఆజ్ఞాపించాడు. మరి ఇప్పుడు యువ రాణి కనిపించడం లేదు. ఏం చేయాలి? ఈ సమయంలో భయపడి ప్రయోజనం ఏమిటి? గండం గడవడానికి వృద్ధస్త్రీ క్షణంలో ఒక ఉపాయం ఆలోచించింది. వెంటనే పరిచారిక మాలిని గదిలోకి వెళ్ళి ఆదమరచి నిద్రపోతూన్న, ఆమెను తట్టిలేపి, "ఆభరణాలు ధరించి, అలంకరించుకుని ప్రయాణానికి వెంటనే సిద్ధం కా!" అని ఆజ్ఞాపించింది వృద్ధస్త్రీ.

కొంతసేపటికి ఆమె మాలినిని మెట్ల గుండా కిందికి తీసుకువచ్చింది. అక్కడ ఒక పల్లకీ సిద్ధంగా ఉన్నది. అది తన కోసమే అని నమ్మలేక, మాలిని, "ఇందులోనా! నేను ఎక్కడికి వెళ్ళాలి?" అని అడిగింది ఆశ్చర్యంగా.

"అవును. అది నీ కోసమే. ఎక్కడికి వెళ్ళాలన్న విషయం నీకు అనవసరం. పల్లకీ వెంట నేను నడిచి వస్తాను. నీకు ఎలాంటి భయమూ వద్దు. నేను చెప్పినట్టు చెయ్యి. ఇది యజమాని ఆజ్ఞ!" అని హెచ్చరించింది వృద్ధస్త్రీ.

మాలిని మారుమాట్లాడకుండా వెళ్ళి పల్లకీలో కూర్చుని తెరను దించింది. బోయీలు పల్లకీ నెత్తుకున్నారు. భవన ద్వారం తలుపులు మూసుకుని వృద్ధస్త్రీ కూడా పల్లకీ వెంట నడవసాగింది.

మాయాభవనం నుంచి బయటపడి అంతకు ముందే అరణ్యంలోకి చేరిన మహేంద్రనాథుడికీ, యువరాణి విద్యావతికీ ఒక మార్గం కనిపించింది. వాళ్ళు వేరెవరికంటా పడకూడదన్న జాగ్రత్తతో– కొంతదూరం నడిచి వెనకకు తిరిగిచూస్తూ, ఏదైనా అలికిడి వినిపించినప్పుడు పక్కకు తప్పుకుని చుట్టుపక్కలు పరిశీలించు కుంటూ ముందుకు నడవసాగారు. కొంత సేపటికి వాళ్ళకు దూరంనుంచి బోయీల పాటవినిపించింది. చప్పునవాళ్ళు ఒక పొద

చాటున దాక్కున్నారు. మరి కొంతసేపటికి నలుగురు బోయీలు ఒక పల్లకీని మోసుకుంటూ ఆ మార్గం గుండా వాళ్ళను దాటుకుని వెళ్ళిపోయారు. పల్లకీ వెంట వృద్ధస్త్రీ నడుస్తున్నది. పల్లకీలో వెళుతున్నది ఎవరో తెలియలేదు. పల్లకీ తనకోసమే వచ్చింది కదా? మరి అందులో ఇప్పుడు ఎవరు వెళుతున్నారో అని ఆలోచించ సాగింది యువరాణి.



"యువరాణీ! మనం చాలా జాగ్రత్తగా ఉండాలి. వేషాలు కూడా మార్చుకోవడం మంచిది!" అన్నాడు మహేంద్రనాథుడు.

"నిజమే! తెల్లవారాక మార్చుకుందాం." అన్నది యువరాణి.

తెల్లవారే సమయానికి బోయీలు మోసుకు వెళ్ళిన పల్లకీ ఒక సమతల ప్రదేశాన్ని చేరుకున్నది. అక్కడ మరిద్దరు బోయీలు వేరొక పల్లకీతో సిద్ధంగా ఉన్నారు. వాళ్ళకు దాపుల ముగ్గురు వ్యక్తులు గుర్రాల మీద ఉన్నారు. ఆ ముగ్గురిలో ఒక వ్యక్తి వృద్ధస్త్రీని సమీపించి, "యువరాణిని ఆ పల్లకీ నుంచి ఈ పల్లకీలోకి రమ్మను," అని ఆజ్ఞాపించాడు.

ఆ మాటలకు ఆశ్చర్యపోయిన వృద్ధస్త్రీ, "యజమాని ఎక్కడ? నేనాయనతో మాట్లాడాలి!" అన్నది.

"యజమాని మా కోసం మరొక చోట వేచి ఉన్నాడు. యువరాణిని క్షేమంగా ఆయన దగ్గరికి చేర్చే బాధ్యత మాది. నీకా విచారం వద్దు. నువ్వు ఈ పల్లకీలోనే మాయాభవనం చేరవచ్చు!" అని ఆజ్ఞాపించాడావ్యక్తి.

అతడి కంఠస్వరం తన యజమాని కంఠస్వరంలాగే ఉండడంతో ఒక్కక్షణం ఉలిక్కి పడిన వృద్ధస్త్రీ, అతని ముఖాన్ని ఒకసారి తేరిపార చూసింది. అతనికి గడ్డం లేదు. ముఖంలో రాచఠీవి ఉట్టిపడుతున్నది. చూడడానికి ఎవరో రాకుమారుడిలాగా ఉన్నాడు.

ఇక చేసేది లేక ఆమె అతని ఆజ్ఞానుసారం మాలినిని ఆమె ఉన్న పల్లకీ నుంచి దించి, కొత్త పల్లకీలోకి పంపుతూ, "వీళ్ళు



నిన్ను సురక్షితంగా యజమాని దగ్గరికి చేర్చగలరు. భయపడ వద్దు!" అని చెప్పి పల్లకీ తెర మూసింది.

మరుక్షణమే గుర్రాలపై వున్న ముగ్గురు వ్యక్తుల వెంట పల్లకీ కదిలింది.

వృద్ధస్త్రీ, అంతకు ముందు మాలిని వచ్చిన పల్లకీలో మాయాభవనానికి వెను తిరిగింది.

సూర్యోదయం కాగానే మార్గం స్పష్టంగా కనిపించడంతో, మహేంద్రనాధుడూ, యువ రాణీ అమితోత్సాహంతో వేగంగా కొండ దిగనారంభించారు. అలా వాళ్ళు నడిచి నడిచి, మిట్టమధ్యాహ్న సమయానికి కొండ పాదతలం చేరి, కొంతసేపు విశ్రాంతి తీసుకుని, మళ్ళీ ప్రయాణం కొనసాగించారు. పడమటి దిశలో పొద్దువాలుతూ ఉండగా వాళ్లొక సమతల ప్రదేశం చేరుకున్నారు. దూరంగా ఒక కుటీరం కనిపించింది. అది తనను దీవించి పంపిన ముని కుటీరమే అని గ్రహించి మహేంద్రనాధుడు పరమానందం చెందాడు. తన వేలికి ఉన్న ఉంగరాన్ని కృతజ్ఞతగా ఒకసారి చూసుకున్నాడు. ముని తనకు మహిమగల ఉంగరాన్ని ఇచ్చి ఆశీర్వదించి పంపిన విషయాన్ని యువరాణికి తెలియజేశాడు. ఆయనకిచ్చిన మాట ప్రకారం తిరుగు ప్రయాణంలో ఆయనను దర్శించుకుని వెళ్ళవచ్చు అనుకుంటూ అతడు ఆ కుటీరం కేసి నడిచాడు.

అంతలో కుటీరం నుంచి వెలుపలికి వచ్చిన ముని చిరునవ్వుతో, "రా, నాయనా! నువ్వీకార్యంసాధించగలవని నాకుతెలుసు. వీరగిరి యువరాణి విద్యావతికి స్వాగతం!" అన్నాడు.

"మా రాక కోసమే తమరు ఎదురు చూస్తున్నట్టున్నారు. మేము రావడం మీకెలా తెలిసింది?" అని అడిగాడు మహేంద్ర నాధుడు.

ముని తన వేలికి పెట్టుకున్న ఉంగరాన్ని చూపి, "ఈ ఉంగరానికీ, ఆ రోజు నేను నీకిచ్చిన ఉంగరానికీ కొన్ని మహిమలు ఉన్నాయి. ఈ ఉంగరాన్ని నేను ధరించ



గానే, అది నీకు తెలియకుండానే నీ ఉంగరం ద్వారా నిన్ను నా సమక్షానికి నడిపించింది," అన్నాడు.

"అలాగా!" అంటూ మునికి నమస్కరించాడు మహేంద్రనాధుడు.

"మీరిద్దరూ ఇక్కడికి రావడం నాకెంతో ఆనందంగా ఉన్నది. ఈ రాత్రి ఈ కుటీరంలోనే గడిపి, తెల్లవారగానే బయలు దేరండి!" అన్నాడు ముని.

ఆ రాత్రి నిద్రపోవడానికి ముందు, మహేంద్రనాధుడూ, యువరాణీ వాళ్ళు అక్కడికి చేరడానికి పూర్వం జరిగిన విశేషాలన్నిటినీ మునికి వివరించారు. ముని వాటిని చిరునవ్వుతో విన్నాడు.

మరునాడు తెల్లవారగానే, ముని మహేంద్రనాధుణ్ణీ, యువరాణినీ దగ్గరికి పిలిచి, "మీతోపాటు నేనూ రాజధానీ నగరానికి వస్తాను. అది మీకు కొంత రక్షణగానూ ఉంటుంది. ఇంత కాలానికి నా కర్తవ్యాన్ని నెరవేర్చడానికి కలిగిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటాను," అన్నాడు చిరునవ్వుతో.

"ఏమిటి?" అన్నట్టు ఆశ్చర్యంగా చూశాడు మహేంద్రనాధుడు.

"మీకా విషయం తెలియాలంటే, నా కథ కూడా కొంత తెలుసుకోవాలి," అన్నాడు ముని.

"చెప్పండి!" అన్నాడు మహేంద్రనాధుడు ఉత్సాహంగా.

"అదొక పెద్ద విషాద గాథ. అయినా, మీకది క్లుప్తంగా తెలియజేస్తాను," అంటూ ముని ఇలా చెప్పాడు:

"మహిమాపురి రాజ్యం గురించి మీరు వినే ఉంటారు. యువరాజు వీరేంద్రనాధుడు యువకుడుగా ఉన్నప్పుడు అతని తండ్రి వేటకుపోయి, ప్రమాదానికి గురై ప్రాణాలు కోల్పోయాడు. ఇరవై ఒకటవ యేట వీరేంద్రనాధుడికి రాజ్యాభిషేకం జరిగింది. అయినా, సోదరి ఐశ్వర్యను ఆయనకు అప్పగించి అతని తల్లి కూడా కన్ను మూసింది. ధర్మనిరతుడూ, భక్తితత్పరుడూ అయిన వీరేంద్రనాధుడు ప్రజా

రంజకంగా పరిపాలన సాగించాడు. సహోదరి ఐశ్వర్యను పొరుగు రాజ్యం యువరాజు అయిన సురేంద్రనాధుడికిచ్చి పెళ్ళిచేశాడు. వారి కొక మగశిశువు కలిగాడు. వీరేంద్రనాధుడు తరుచూ తీర్థయాత్రలకు వెళ్ళేవాడు. ఆ కారణంగా సురేంద్రనాధుడూ, అతని తమ్ముడైన, జితేంద్రనాధుడూ మహిమాపురిలోనే ఉండే వారు.

ఒకసారి వీరేంద్రనాధుడు తీర్థయాత్రకు వెళ్ళడం తెలిసి, పాటలీపురరాజు మహిమా పురి మీదికి దండెత్తి వచ్చాడు. యుద్ధంలో సురేంద్రనాధుడు మరణించాడు. సురేంద్ర నాధుడి భార్య ఐశ్వర్యనూ, బిడ్డనూ, తమ్ముడు జితేంద్రనాధుణ్ణీ శత్రువులు రాజ్యం నుంచి తరుమగొట్టారు. తీర్థ యాత్రల నుంచి తిరిగి వచ్చిన వీరేంద్ర నాధుణ్ణి పట్టి బంధించారు. తన తోబుట్టువు దూరం కావడంతో రాజు తీరని విచారంతో కారాగారంలోనే మరణించాడు.

జితేంద్రనాధుడు అన్న కుమారుణ్ణీ, ఐశ్వర్యనూ తీసుకొని ఎక్కడెక్కడో తిరిగి, ఆఖరికి వీరగిరి రాజ్యానికి చేరుకున్నాడు. అక్కడ కొంతకాలం ఒడిదుడుకులతో గడిచింది. జితేంద్రనాధుడు ఒక యువతిని పెళ్ళాడాడు. అయితే, హఠాత్తుగా ఆమె కూడా మరణించడంతో, జీవితం మీద విరక్తి పుట్టి, జితేంద్రనాధుడు ఇల్లు వదిలి దేశాటనకు బయలుదేరి, ఆఖరికి ఒక అరణ్యంలో కుటీరం నిర్మించుకొని కాలం



గడుపుతున్నాడు. అనాథగా వదిలి వచ్చిన వదినెనూ, మహిమాపురి సింహాసనానికి వారసుడైన ఆమె కుమారుణ్ణీ చూడడాని కైనా వెళ్ళలేదు!"

ఆ మాటలతో ముని రెండు కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి.

"ఆమె కుమారుడి పేరేమిటో చెప్ప లేదు!" అన్నది యువరాణి.

"మహేంద్రనాథుడు!" అన్నాడు ముని ఎంతో ఆనందంగా.

మహేంద్రనాథుడు, ముని తన పినతండ్రి జితేంద్రనాథుడని గ్రహించి, ఆయనను ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు.

"నేను రాజధానికి వచ్చి రెండు కర్తవ్యా లను నెరవేర్చాలి. మహేంద్రనాథు డెవరో రాజుగారికి తెలియజేయాలి. మహేంద్ర నాథుడి తల్లిగారికి చెప్పా పెట్టకుండా హఠాత్తుగా ఇల్లు వదిలిపెట్టినందుకు క్షమాపణలు చెప్పుకోవాలి. ఆ తరవాత నేను ఇక్కడికి నిశ్చింతగా తిరిగి వచ్చి, ఈ ప్రశాంత వాతావరణంలో కాలం వెళ్ళ బుచ్చుతాను," అన్నాడు ముని ప్రసన్న వదనంతో.

మహేంద్రనాథుడూ, విద్యావతీ ఏదో చెప్పబోయారు.

అయినా ముని వారిస్తూ, "మీరు ఆశ్రమ వాసుల దుస్తులు ధరించండి. నేనూ మీ వెంట ఉన్నాను గనుక, మిమ్ములను ఎవరూ గుర్తు పట్టలేరు. ఇప్పుడు బయలు దేరామంటే సూర్యాస్తమయ వేళకు రాజధానీ నగరం చేరుకోగలం. అక్కడి నుంచి తిన్నగా రాజప్రాసాదం చేరుకుం దాము," అన్నాడు.

"ఇప్పుడే రాజప్రాసాదం చేరుకున్నంత ఆనందంగా ఉన్నది మహాత్మా!" అంటూ యువరాణి, ఆభరణాలన్నిటినీ క్షణంలో తీసివేసి, కుటీరం లోపలికి వెళ్ళి, బట్టలు మార్చుకుని మునికుమారిలా తిరిగి వచ్చింది. మహేంద్రనాథుడు కూడా ముని కుమారుడిలా తయారయ్యాడు.

ముగ్గురూ వీరగిరి రాజ్యం కేసి బయలు దేరారు. —(ముగింపు వచ్చే సంచికలో)






# సత్యవంతుడివారసుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీకు ఇంత కఠోర మైన శ్రమతో కూడిన పని కల్పించిన వాడు, నీకు ప్రేమాస్పదుడైన తండ్రి కానీ లేక నువ్వు గౌరవించే గురువు కానీ కాదు కద? ఎందుకంటే, ఒక్కొక్కసారి అలాంటివారు, తమ పుత్రులూ, శిష్యులూ తమ శక్తి సామ ర్థ్యాలను ప్రదర్శించినా, క్షణికమైన మాన సిక బలహీనతా, కోపతాపాల కారణంగా, వాళ్ళను నిరాదరణకు గురి చేస్తారు. ఇందుకు నిదర్శనంగా సత్యవంతుడనే అతడికథ చెబుతాను, శ్రమతెలియకుండా, విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

చిత్రాపురం అనే గ్రామంలో ప్రజలు నిత్యం కలహించుకుంటూ, పరస్పరం ఐక

**బేతాళ కథలు**



మత్యం లేకుండా వుండేవారు. ఒకరోజున ఆ గ్రామానికి సత్యవంతుడనే నడివయస్కుడు వచ్చాడు. ఆయన అనారోగ్యంతో బాధ పడుతూ ఇక ప్రయాణాన్ని కొనసాగించలేక, ఆ పూట ఆ గ్రామంలోనే ఏదో ఒక ఇంట బస చేయాలనుకుని దారివెంట పోతున్న వాడిని అడిగాడు.

వాడాయనకుచేతులు జోడించి,"అయ్యా! నేను పేదవాణ్ణి. నాకే నిలువ నీడలేదు. పగలంతా ఆ ఇంటా ఈ ఇంటా పని చేసు కుంటూ రాత్రి పూట ఏ చెట్టుకిందనో పడు కుంటూంటాను. తమరు ఆ పక్కవీధిలోని చెంగయ్యగారింటికో, ఈ పక్కవీధిలోని చెంచయ్యగారింటికో వెళ్ళండి. అక్కడ మీకు బసచేయడానికి తప్పక ఆశ్రయం దొరుకుతుంది," అన్నాడు.

సత్యవంతుడు అవస్థ పడుతూ ఆ పక్క వీధికి వెళ్ళి ఇంటి తలుపు తట్టి, తలుపు తీసిన మనిషిని, "చెంచయ్యగారిల్లిదేనా?" అని అడిగాడు.

ఆ మనిషి కోపంగా, "నా పేరు చెంగయ్య. నా ఇంటికొచ్చి ఆ చెంచయ్య పేరెత్తే ధైర్యం ఈ ఊళ్ళో ఎవరికీ లేదు. నువ్వు కొత్త వాడి విలా కనబడుతున్నావు, కాబట్టి క్షమిస్తు న్నాను. వెళ్ళు!" అన్నాడు.

సత్యవంతుడు తన పరిస్థితిని చెంగ య్యకు వివరించిచెప్పి, ఆశ్రయమడిగాడు. చెంగయ్య తల అడ్డంగా ఊపి, "ఎవరో ఇద్దరి పేర్లు చెబితే, నా పేరు మరవడమే కాకుండా ఆ చెంచయ్య పేరు గుర్తుంచు కున్నావు. నీకు నేను ఆశ్రయం ఇవ్వను, పో!" అని తలుపు గభాలున మూసేశాడు.

సత్యవంతుడు వాకబు చేసుకుంటూ చెంచయ్య ఇంటికి వెళితే, "ఈ ఊళ్ళో ఆ చెంగయ్య ఇంట ఎవరడుగుపెట్టినా ముందే నాకు తెలిసిపోతుంది. ముందు వాడింటి తలుపు తట్టిన వాడికి, నా ఇంట్లో ఆశ్రయం లభించదు, పో!" అన్నాడాయన.

ఆ తర్వాత సత్యవంతుడు మరికొన్ని ఇళ్ళలో ఆశ్రయానికి ప్రయత్నించాడు. కానీ చెంగయ్య, చెంచయ్య పొమ్మన్న వారిని గ్రామంలో ఎవరూ ఆదరించరట!

తన దురదృష్టాన్ని నిందించుకుంటూ ఆయన చిత్రాపురం విడిచి పెట్టాలను కున్నాడు. కానీ వంట్లోశక్తిచాలక, ఊరిపొలి మేరలో ఒక చెట్టు కింద చతికిలబడ్డాడు. కొంతసేపు గడిచాక, అంతకు ముందు చెంగయ్య, చెంచయ్యల గురించి చెప్పిన వాడు అక్కడికి వచ్చి, "అయ్యా! నీ గురించి జరిగిందంతా విన్నాను. నువ్వు చెంగయ్య, చెంచయ్యలతో గొడవపడి వచ్చావు కాబట్టి, ఈ చెట్టు కిందవున్నా గొడవ కావచ్చు. ఆ కనిపించే పొదల వెనకకు పోయి విశ్రాంతి తీసుకో," అని చెప్పాడు.

సత్యవంతుడుపొదలమాటుకు వెళ్ళాడు. ఎక్కడా కూర్చునేందుక్కూడా వీలు లేకుండా, రకరకాల మొక్కలు నేలంతా పరుచుకుని వున్నాయి. అక్కడ ఆయన పడుకునేందుకు కొంత నేల శుభ్రం చేశాడు. అప్పుడు పొదల్లో నుంచి రెండు నల్లత్రాచులు బయటపడి పడగ విప్పి వెళ్ళి పోయాయి. అవి తననేమీ చేయనందుకు సత్యవంతుడు సంతోషించి, అక్కడే పడు కుని నిద్రపోయాడు.

మర్నాడు నిద్రలేచేసరికి సత్యవంతుడు, తనొక కొండచిలువచుట్టుకుని వుండడం గమనించాడు. అయితే ఆయనలో కాస్త కదలిక రాగానే, కొండచిలువ ఆయనను విడిచిపెట్టి వెళ్ళి పోయింది. ఒక రాత్రంతా కొండచిలువ తనను చుట్టుకుని వున్నదని



గ్రహించగానే, సత్యవంతుడికి వళ్ళు జల దరించింది.

అయితే, అంతకు మించిన మరొక విశేషం ఆయన గమనించాడు. ఇప్పుడు ఆయనలో అనారోగ్యపు ఛాయలు కూడా లేవు. మనిషిలో ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. అక్కడ పొదలలో అంతవరకూ ఎవరికీ తెలియని ఓషధులుండి వుండాలని అనుమానించి, ఆయన పరీక్షించి చూసి రూఢి చేసుకున్నాడు.

ఆ సమయంలో దాపుల పెద్ద కలకలం వినిపించింది, సత్యవంతుడికి. ఆయన పొదల మాటునుంచి బయటికి వచ్చాడు. అక్కడ చాలామంది జనం రెండు గుంపు

లుగా విడిపోయి దెబ్బలాడు కుంటున్నారు. వాళ్ళ మధ్య ఇద్దరు యువకులు స్పృహ లేకుండా పడి వున్నారు.

జరిగిందేమంటే— చెంగయ్య కొడుకూ, చెంచయ్య కొడుకూ మాటామాటా అను కుని, కర్రలతో కొట్టుకున్నారు. దానితో ఇద్దరూ గాయపడి కొనప్రాణాలతో వున్నారు. ఇది చూసి ఉగ్రులైపోయిన చెంచయ్య, చెంగయ్య తమ తమ జనాన్ని కూడగట్టు కుని దొమ్మియుద్ధానికి దిగారు.

సత్యవంతుడు, యువకులకేసి పరీక్షగా చూసి, "వీళ్ళ ముఖాల్లో ఇంకా జీవకళ వున్నది. దయచేసి మీ దెబ్బలాటఇంతటితో కట్టిపెట్టండి. నేనువీళ్ళకు వైద్యం చేస్తాను," అన్నాడు.

అంతే! గొడవ ఆగిపోయింది.చెంగయ్య, చెంచయ్య సత్యవంతుణ్ణి గుర్తు పట్టి, "నిన్న టికి నువ్వే రోగిష్టివాడివి. నీ వల్ల వైద్యమే మవుతుంది?" అన్నారు.

ఇందుకు సత్యవంతుడు కోపగించు కోకుండా, "మీరు కక్షల్లో, కలహాల్లో మునిగి పోయి, ఊరిలోని విశేషాలు తెలుసుకో లేకుండా వున్నారు. నేను అంతు తెలియని వ్యాధితో బాధపడుతూ, జీవితం మీద విరక్తి పుట్టి భార్యాబిడ్డలను విడిచి హిమాలయాల దారి పట్టిన వైద్యుణ్ణి. ఇక్కడి అద్భుత మూలికలు నా జబ్బును ఒక్క రాత్రిలో మటుమాయం చేశాయి. ఆ మూలికలు క్రూర జంతువులను, విషసర్పాలను కూడా సాధువులుగా మార్చేటంత గొప్పవి. అవి



కొనప్రాణంతో వున్నవాడిని కూడా అమృతమై రక్షించగలవు," అన్నాడు.

"సరే— నీ ప్రయత్నం నువ్వు చెయ్యి. కానీ వాడి కొడుకు బ్రతికి నా కొడుకు బ్రతక్కుండాపోతే మాత్రం నీప్రాణాలు దక్కవు," అని చెంగయ్య, చెంచయ్య ఇద్దరూ సత్యవంతుణ్ణి హెచ్చరించారు.

సత్యవంతుడు అందుకేమాత్రమూచలించక, ఆ యువకులిద్దర్నీ పాదల మాటుకు తీసుకువెళ్ళి వైద్యం చేశాడు. కాసేపటికిద్దరూ తేరుకున్నారు.

అప్పుడు చెంగయ్య, చెంచయ్య ఇద్దరూ ఎంతో సంతోషించి, ఆయనను కొన్ని రోజులు తమకు అతిథిగా వుండి వెళ్ళాలని బలవంతపెట్టారు.

"ఈ గ్రామంలో నా ఆరోగ్యం బాగుపడింది కాబట్టి, నేనీ గ్రామానికే అతిథిని. గ్రామంలోప్రతిఒక్కరూ అనారోగ్యంతో బాధపడుతున్నట్టు కనబడుతున్నది. అందుకు చికిత్స చేయడం నా బాధ్యత. కొంతకాలం ఇక్కడేవుంటాను,"అన్నాడు సత్యవంతుడు.

సత్యవంతుడు వైద్యుడేకాక మహా పండితుడుకూడా. తన జ్ఞానంతో ఆయన అక్కడి వారిలో అసూయా ద్వేషాలను పోగొట్టాలని నిర్ణయించుకున్నాడు. మెదడులేని జంతువులను మూలికలతో అదుపు చేసినట్లే, మెదడున్న మనుషులను సుభాషితాలతో అదుపు చేయవచ్చునని గ్రహించి, ఆయన ప్రతిరోజూ గ్రామస్థుల నొక చోట చేరదీసి, ప్రాచీన గ్రంథాల్లోని మంచి మాటలు,





అందరూ కూడబలుక్కుని, "మాలో ఏ ఒక్కరినీ గ్రామానికి నాయకుడుగా అంగీక రించలేం. అలాచేస్తే తిరిగి మాలో అసూయా ద్వేషాలు రేగిపోయి, అధ్వాన్న స్థితికి చేరుకుంటాం," అన్నారు.

సత్యవంతుడు కొంతసేపు ఆలోచించి, "నాకు వేరే బాధ్యతలున్నాయి. నేను నా వారసుడిని ఇక్కడికి పంపిస్తాను. వాడిని గ్రామాధికారిని చేయండి," అని చెప్పాడు.

అయిష్టంగానే అందరూ దీనికి అంగీక రించారు.

సత్యవంతుడు తన ప్రాంతానికి తిరిగి వెళ్ళి, తన ఇంట్లో జరిగినదంతా చెప్పి, సత్యశీలుడనే తన కొడుక్కు గ్రామాధికారి కావడానికి శిక్షణనిచ్చాడు. అయితే, సత్య శీలుడికి ఒకపట్టాన పరిపాలనావ్యవహా రాలు అర్థం కాకపోవడంవల్ల,సంవత్సరాలు గడిచినా ఆయనకు వాడిపట్ల తృప్తి కలగలేదు.

అయిదు సంవత్సరాలు అలా గడిచాక ఆయన సత్యశీలుడితో, "నువ్వు చిత్రాపురం వెళ్ళి నేనిచ్చిన ఉత్తరం చూపించి, అక్కడ గ్రామాధికారివై సమర్థవంతంగా ఆగ్రామాన్ని పాలించు. ఆ తర్వాత నేను వచ్చి, నీ వెలా పాలిస్తున్నదీ పరీక్షిస్తాను," అని చెప్పాడు.

సత్యశీలుడు చిత్రాపురం వెళ్ళేసరికి, గుణనాధుడనే వాడు తనే సత్యవంతుడి వారసుడనని చెప్పుకుని గ్రామాధికారి అయి

మహాపురుషుల కథలు వారికి చక్కగా వివరించి చెప్పేవాడు.

క్రమంగా అక్కడి వారిలో మార్పు వచ్చింది. చిత్రాపురంలోని వ్యక్తుల ప్రతిభ బయటపడి, దానికి పొరుగు గ్రామాల్లో గుర్తింపు వచ్చింది. ఏడాది తిరిగేసరికి ఆ గ్రామంలో అందరికీ ఆదాయం పెరిగింది.

అప్పుడు సత్యవంతుడు తానిక వెళతా నన్నాడు. కానీ గ్రామస్థులందరూ ఏక కంఠంతో,ఆయనను గ్రామాధికారిగా వుండ మని కోరారు.

సత్యవంతడు అందుకు అంగీకరించక, "మీలో ఎవరో ఒకరిని గ్రామాధికారిగా చేసు కోండి," అన్నాడు.

నట్లు తెలిసింది. ఆ విధంగా వాడక్కడ చేరి నాలుగు సంవత్సరాలకు పైనే అయింది.

సత్యశీలుడు తన వద్ద వున్న ఉత్తరంతో చెంగయ్య ఇంటికి వెళ్ళి జరిగింది చెప్పాడు. చెంగయ్య ఆశ్చర్యపడి, కొంత మంది గ్రామస్థులను వెంటబెట్టుకుని గుణ నాధుడింటికి వెళ్ళి, సంజాయిషీ అడిగాడు.

గుణనాధుడు చలించక, "నేనే సత్య వంతుడి వారసుణ్ణి. ఈ విషయం ఆయనే స్వయంగా వచ్చి చెప్పగలడు," అన్నాడు.

సత్యశీలుడు కోపం పట్టలేక, "ఇంత జరి గినా ఇతడికి బుద్ధి రాలేదు. వీడికి పదవీ వ్యామోహంతోతప్పొప్పులుతెలియడంలేదు. ముందు పదవిని విడిచిపెట్టమనండి!" అన్నాడు.

చెంగయ్య, సత్యశీలుడి పక్షం వహిస్తే, మరికొందరు గుణనాధుడి పక్షం వహిం చారు. సులభంగా వదిలిపోతుందనుకున్న గొడవ పెద్దదయింది. గ్రామంలో కొట్లాటలు మొదలయ్యాయి.

ఇలా కొన్నాళ్ళు గడిచాక, ఒక రోజున సత్యశీలుడు చెంగయ్యతో, "ఈ గొడవ ఇలా తేలేది కాదు. నువ్వు మా తండ్రిగారికి విషయం తెలియబరుస్తూ కబురు పంపి రప్పించు," అన్నాడు.

వార్త అందగానే సత్యవంతుడు వచ్చాడు. ఆయన అక్కడి పరిస్థితి విచారించాక, గుణనాధుణ్ణి ఏకాంతంలో కలుసుకున్నాడు.



గుణనాధుడు, ఆయన కాళ్ళ మీద పడి, "అయ్యా! నేనుపదవీవ్యామోహంతో ఇక్కడికి రాలేదు. మీరు వెళ్ళగానే ఈ గ్రామంలో కలహాలుమొదలయ్యాయి. అప్పుడొక గ్రామ స్థుడు, మా ఊరొచ్చి స్నేహితుడనైన నాకు విషయం చెప్పుకున్నాడు. అతడి కోరికపై నేనిక్కడ మీ వారసుడనని చెప్పుకుని, గ్రామాధికారినయ్యాను. మీ బాటలోనే నడుస్తూ, ఈ గ్రామాన్ని ఆదర్శవంతమైన గ్రామం అని అందరూచెప్పుకునేలాచేశాను. మీ అబ్బాయి సత్యశీలుడు ముందుగా నా వద్దకు రాకుండా, చెంగయ్య వద్దకు పోవ డంతో, నన్ను నేను కాపాడుకోవడమెలాగో తెలియక,మీరురావాలన్నాను. ఇప్పుడు మీరే

నన్నుకాపాడాలి," అన్నాడు. సత్యవంతుడు, అతడినోదార్చి అతడే తన వారసుడని గ్రామస్థులందరికీచెప్పి, సత్యశీలుణ్ణి వెంట బెట్టుకుని తిరుగుప్రయాణమయ్యాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సత్య వంతుడి ప్రవర్తనను ఏమనాలి? గ్రామాధి కారి కావాలని ఏమాత్రం కోరని సత్య శీలుడు, అతడి ఆదేశం కారణంగానే కదా నిండు అయిదు సంవత్సరాలు ఆ పదవికి అవసరమైన శిక్షణకు అంగీకరించాడు. అలాంటప్పుడు, సత్యశీలుణ్ణి కాదని అవ మానించి, తన వారసుడినంటూ చెప్పు కున్న కపటి గుణనాధుణ్ణి, తన వారసుడే అని గ్రామస్థులతో సత్యవంతుడు చెప్పడం మానసికమైన బలహీనతో లేక కొడుకు పట్ల అర్థంలేని కోపమో కారణం అయివుం టుంది గదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సత్యవంతుడు తన కొడుకైన సత్యశీలుణ్ణి అవమానించా డనే దాంట్లో సందేహానికి తావులేదు. అదే వాడికి తగిన శిక్ష. గుణనాధుడు నాలుగు సంవత్సరాలకు పైగా గ్రామాధికారిగా వున్నా, ఎవరికీ అతడు సత్యవంతుడి వారసుడు కాదన్న అనుమానం రాలేదు. అతడు గ్రామస్థులను సఖ్యంగా వుంచి గ్రామానికి మంచి పేరు తెచ్చాడు. ఇక సత్యశీలుడో, అతడు గ్రామాధికారి కావాలన్న వ్యామో హంతో గ్రామంలో కక్షలు రేపి రెండు ముక్కలుగా విడగొట్టాడు. పదవుల విష యంలో వారసత్వం; ఆదర్శాలకూ, ఆశయా లకేగానీ కుటుంబానికి కాదు. గుణ నాధుడు, తాను సత్యవంతుడి వారసుడనని చెప్పినా, అది గ్రామాన్ని బాగు చేయాలన్న సదుద్దేశ్యంతోనే. పదవీ వ్యామోహం వల్ల కాదు. అందుకే సత్యవంతుడు అతణ్ణి సమర్థించాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]



# చందమామ అనుబంధం-52

## మనదేశపు పక్షులు-జంతువులు:



## గంభీరమైన ఏనుగు

పిల్లలు పుస్తకాలూ, బొమ్మలూ మొదలైన బహుమతుల కన్నా ఏనుగుమీద ఎక్కి ఊరేగడానికి ఎక్కువగా ఇష్టపడతారు. యేటా రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా ఢిల్లీలో జరిగే ఊరేగింపులో ఏనుగులు కూడా పాల్గొంటాయి. అదే విధంగా 'దసరా' సందర్భంగా మైసూరులోనూ, జైపూర్‌లోనూ, 'పూరమ్' సందర్భంగా కేరళలోని తిరుచ్చూర్‌లో జరిగే ఏనుగుల ఊరేగింపులు చాలా ప్రసిద్ధి గాంచినవి. దక్షిణ భారతదేశంలో కొన్ని దేవాలయాలలో ఉదయం, సాయంకాలం దేవుణ్ణి ఏనుగు మీద ఊరేగించడం సంప్రదాయంగా ఉంటున్నది.

చతురంగ బలాలలో గజబలం ప్రధానమైనది. చంద్రగుప్త మౌర్యుడి సైన్యంలో 10,000 ఏనుగులు ఉండేవని చరిత్ర చెబుతున్నది.

భూచరాలన్నిటిలోకీ ఏనుగు చాలా పెద్ద జంతువు. వాటినిమచ్చికచేసుకోవడంసులభం. వాటిని రకరకాలుగా ఉపయోగిస్తారు.

మనదేశంలో ఒంటెల పందాలలాగే ఏనుగుల పందాలు కూడా అక్కడక్కడ జరుగుతాయి. అయితే ఏనుగులనుమామూలుగా అడవులలో పెద్దపెద్ద దుంగలను మోయడానికి ఎక్కువగాఉపయోగిస్తూ ఉంటారు.

సాధారణంగా ఏనుగు 3 మీటర్ల ఎత్తూ, 4000 — 5000 కి॥ గ్రా॥ బరువూ ఉంటుంది. 1.40 మీటర్ల పొడవైన తొండం పైకీ, కిందికీ వంగడానికి వీలుగానూ, దృఢంగానూ ఉంటుంది. తొండం, ఏనుగు ముక్కు. తొండంతో నీళ్ళు పీల్చుకుని నోట్లోకి చిమ్ముకుంటుంది. నేలమీది నాణాలవంటి చిన్న చిన్న వస్తువులనుకూడా తొండంతో ఎత్తగలదు. మామూలుగా మగ ఏనుగులకు రెండు దంతాలు ఉంటాయి. ఇవి చాలా విలువైనవి. అడవి ఏనుగులు గుంపులు గుంపులు గానే నివసిస్తాయి. ఇంత పెద్ద ఏనుగుకు కళ్ళు మాత్రం చాలా చిన్నవి. అయితే, వాటి ఘ్రాణశక్తీ, శ్రవణశక్తీమాత్రం చాలా సూక్ష్మమైనవి. 22 నెలల గర్భం తరవాత ఏనుగు ఈనుతుంది. ఏనుగు చాలా తెలివైనది. ఇది గొప్ప జ్ఞాపకశక్తి గలది.

మనదేశంలోని ఏనుగులుఆఫ్రికా ఏనుగుల కన్నా పరిమాణంలో చిన్నవి.



# మన సమకాలీన సాహిత్యం

మద్రాసు నగరంలోని ఒక ఆస్పత్రిలో పనిచేస్తున్న అందమైన యువతి డాక్టర్ శంకరి. నలుగురిచేతా మంచి డాక్టర్ అనిపించుకున్న డా॥ శంకరి దగ్గరికి, ఒకనాడు తిరుమూర్తి అనే ధనవంతుడు గర్భవతి అయిన తన భార్యను వెంటబెట్టుకుని వస్తాడు. అతన్ని చూసి ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెందుతుంది డా॥ శంకరి. ఎందుకంటే— గతంలో తనను ప్రేమించి, రహస్యంగా పెళ్ళాడి, హఠాత్తుగా తన జీవితం నుంచి నిష్క్రమించిన గురుమూర్తి అనే యువకుడిలాగే కనిపించాడు తిరుమూర్తి. ఆ తరవాత గురుమూర్తి—తిరుమూర్తి కవల సోదరులని శంకరికి తెలియవస్తుంది. గురుమూర్తి మరణించాడన్న విషయం కూడా ఆమెకు తెలుస్తుంది. అయితే,

## అఖిలన్ 'పొన్‌మలర్'



తిరుమూర్తికి గాని, అతని భార్యకు గాని గురుమూర్తికీ, డా॥శంకరికీ మధ్య ఏర్పడిన సంబంధం గురించి తెలియదు.

తిరుమూర్తి భార్యకు డా॥ శంకరి పర్య వేక్షణలో సుఖప్రసవం జరుగుతుంది. భార్యా భర్తలు ఎంతగానో సంతోషించి, డా॥ శంకరికి కృతజ్ఞతలు తెలియజేస్తారు. ధనవంతుడయిన తిరుమూర్తి డా॥ శంకరికి విలువయిన బహుమతులు ఇస్తాడు.

నిజానికి తిరుమూర్తికి డాక్టర్ పట్ల కేవలం కృతజ్ఞతాభావం మాత్రమేనా అంటే కాదు. అతడు ఆమె అందానికి ఆకర్షితుడై ఆమెను పెళ్ళాడాలనుకుంటాడు!

వివాహితుడై వుండీ తనను పెళ్ళి చేసుకోవడమా? అని ఆశ్చర్యపోయిన డా॥ శంకరి, తిరుమూర్తి పుట్టు పూర్వోత్తరాలను ఆరా తీస్తుంది. అప్పుడు తిరుమూర్తిని గురించిన అసలు విషయాలు ఒక్కొక్కటిగా బయటపడతాయి. అతడు జీవితంలో డబ్బునే ప్రధానంగా భావించి, డబ్బుతో దేన్నయినా 'కొన'వచ్చునని భావించేవాడనీ, డబ్బుకోసం ఎటువంటి దుండగాలకైనా పాల్పడే స్వభావం కలవాడనీ, తన పథకాలకు అడ్డుతగిలే వాళ్ళను డబ్బుతో సునాయాసంగా ఏరిపారేసే దుష్టుడనీ ఆమెకు తెలియవస్తుంది.



ఒకనాడు తిరుమూర్తి కుముద అనే ఒక యువతిని తీసుకువచ్చి డా॥ శంకరి ఆస్పత్రిలోచేర్పిస్తాడు. ఆమెను కూడా అతడు రహస్యంగా పెళ్ళాడాడు. అయితే ఇప్పుడు ఎలాగైనా ఆమెనువదిలించు కోవాలని, ఆస్పత్రిలో చికిత్స ముసుగులో హతమార్చాలని ఒక పథకం వేసి, అందుకు డా॥ శంకరి సహకారాన్ని అపేక్షిస్తాడు. ఒకనాడు హఠాత్తుగాకుముదకనిపించకుండా పోవడంతో పీడ విరగడయిందని తిరుమూర్తి సంతోషిస్తాడు.

ఆ సమయంలో డా॥ శంకరి చిన్ననాటి స్నేహితుడు తిరుజ్ఞానం శంకరిని వెతుక్కుంటూ వస్తాడు. ఒకప్పుడు అనాథ బాలికగా ఉన్న శంకరికి ఎంతో సహాయం చేసిన వాడతను. అతనికి తిరుమూర్తిసంస్థలో ఉద్యోగం ఇప్పిస్తుంది శంకరి. కొన్నాళ్ళకు డా॥ శంకరి తనను వివాహ మాడడానికి తిరస్కరించడంతో, ఆగ్రహానికి లోనైన తిరుమూర్తి, తిరుజ్ఞానాన్ని ఉద్యోగం నుంచి తొలగిస్తాడు. ఆ విషయం తెలిసి తిరుజ్ఞానం నవ్వుకుంటాడు. ఎందుకంటే– అమాయకుల జీవితాలతో ఆడుకుంటూ వాటిని బుగ్గిపాలు చేస్తూన్న తిరుమూర్తి దుర్మార్గాల సాక్ష్యాధారాల కోసం వచ్చిన డిటెక్టివ్ తిరుజ్ఞానం!

డా॥ శంకరినీ, తిరుజ్ఞానాన్నీ హతమార్చడానికి తన మనుషులను ఉసిగొలుపుతాడు తిరుమూర్తి. అయితే ఒకనాటి రాత్రి అలా వారిని చంపడానికి వచ్చిన ఒక దుండగుడు, కారు చెట్టుకు ఢీకొని చస్తాడు. తిరుమూర్తి ఖైదు చేయబడతాడు.

డా॥శంకరి రక్షణలో కుముద క్షేమంగా ఉందని తెలియవస్తుంది.

తిరుజ్ఞానం శంకరిని పెళ్ళాడాలనుకుంటాడు. అయితే, అతడు తిరుమూర్తి దగ్గర పని చేస్తున్నప్పుడు తిరుమూర్తి చెల్లెలు రాజేశ్వరి అతన్ని ప్రేమించిందని శంకరికి తెలియ వస్తుంది. అందువల్ల ఆమె రాజేశ్వరి ప్రేమవివాహానికి అడ్డు రాకూడదనుకుంటుంది. పేదసాదల సేవలకే తన జీవితాన్ని అంకితం చేయాలని ఆమె నిర్ణయిస్తుంది. అందుకే డా॥ శంకరి ఒక స్వర్ణపుష్పం!

'అఖిలన్'గా ప్రసిద్ధిగాంచిన ప్రముఖ తమిళ రచయిత పి.వి. అఖిలాండం (1922 - 1988) రచించిన 'పొన్‌మలర్' (బంగారుపువ్వు) కథ ఇది. స్వార్థపరులైన కొందరు ధనికుల దుండ గాలనూ, సహనశీలి అయిన డా॥ శంకరి ఔన్నత్యాన్నీ, త్యాగనిరతినీ ఈ నవల చక్కగా వివ రిస్తుంది. అఖిలన్ సాహిత్య అకాడమీ బహుమతినీ, భారతీయ జ్ఞానపీఠ పురస్కారాన్నీ అందు కున్నారు.

# మీకు తెలుసా?

1. 'బొన్సాయ్' అంటే ఏమిటి?
2. శక యుగాన్ని స్థాపించిన వారెవ్వరు?
3. ఒక ఖండం పూర్తిగా వ్యాపించి ఉన్న దేశం ఏది?
4. గాంధీజీ స్థాపించిన మొట్టమొదటి ఆశ్రమం ఏది?
5. అతిప్రాచీనమైన జాతీయగీతం గల దేశం ఏది?
6. కాంచీపురం నేత పనివారికి ఒక ప్రత్యేకమైన పేరు ఉన్నది. అది ఏమిటి?
7. 'సినిమా థియేటర్లు' లేని దేశం ఒకటి ఉన్నది. అది ఏదో మీకు తెలుసా?
8. బుద్ధుడు 'నిర్వాణం' చెందిన స్థలం ఏది?
9. మానవశరీరంలో పెద్ద అవయవం ఏది?
10. ఉత్తర భారతదేశంలో 'గోమతీ' నదీతీరంలో వెలసిన రాజధానీ నగరం ఏది?
11. 'ఆధునిక ఇటలీ పిత'గా ఎవరిని చెబుతారు?
12. కొత్త ఢిల్లీలోని 'వైస్రాయ్స్‌హౌస్' (రాష్ట్రపతి భవన్)ను రూపొందించిన వారెవరు?
13. తపాలా బిళ్ళలను మొట్టమొదట వెలువరించిన దేశం ఏది?
14. భారతీయ జాతీయ కాంగ్రెస్ శతవార్షిక ఉత్సవాలను ఎప్పుడు జరుపుకున్నది?
15. ఏథెన్స్ నగరంలో 1896వ సం॥లో జరిగిన ఆధునిక ఒలింపిక్స్‌లో ఎన్ని దేశాలు పాల్గొన్నాయి?

## సమాధానాలు

1. కుండలోపల పెరిగే పరిపూర్ణమైన వృక్షం. ఈ కళ జపానులో ఆరంభమయింది.
2. కనిష్క చక్రవర్తి. క్రీ॥శ॥ 78వ సం॥లో.
3. ఆస్ట్రేలియా.
4. దక్షిణ ఆఫ్రికా దర్బాన్ సమీపంలోని 'ది ఫొనిక్స్ ఫార్మ్'. 1904వ సం॥లో.
5. జపాన్ 'కిమియాగో'. ఇది క్రీ॥శ॥ 9వ శతాబ్దంలో రచింపబడింది.
6. సాలిగార్లు.
7. సౌదీ అరేబియా.
8. కుశీ నగరం.
9. కాలేయము.
10. లక్నో.
11. గారిబాల్డీ.
12. సర్ ఎడ్విన్ లుటీన్స్.
13. ఇంగ్లాండు.
14. 1985.
15. తొమ్మిది.



# దద్ధోజనగండం

తొాళ్ళచెరువు అనే ఊళ్ళో వుండే ధనం జయం ఇంటిపేరు, దద్ధోజనం కాదు. అయితే, దద్ధోజనం చేయడంలో అతడికి అతడే సాటి! ఆ కారణంగా, ఊళ్ళో వాళ్ళం దరూ అతణ్ణి దద్ధోజనం ధనంజయం అనే పిలుస్తూంటారు.

నా అనేవాళ్ళు లేని ధనంజయంకు కచ్చేరీలో ఉద్యోగం వున్నది.

ఒక పెళ్ళిళ్ళ పేరయ్య పుణ్యాన అతడికి పక్క ఊరి పార్వతితో పెళ్ళి కుదిరింది.

"ఈ సంబంధం నాకు నచ్చలేదు. అత డికి వెనక, నా అనేవాళ్ళు లేరు. మంచిక యినా, చెడుకయినా అత్తా, మామా అంటూ వుండాలిగా!" అన్నది పార్వతితల్లి.

పార్వతి మాత్రం, "అటువంటి జంజా టంలేని సంబంధమే నాక్కావాలి. ఇన్నాళ్ళు స్వయంగా ఎలాగూ వండుకు తిన్నాడు. నన్ను వంటపనికి చేయికాల్చుకోమంటూ కాల్చుకు తినడు. పైగా దద్ధోజనం అంటే నాకు ప్రాణం!" అన్నది.

పార్వతి పనిబద్ధకం మనిషి. ఇరుగ మ్మలూ, పొరుగమ్మలూ ఇంటి పనుల్లో వుంటే, ఆమె దారేపోయే సోదెమ్మలనూ, కోయవాళ్ళనూ, బైరాగులనూ, సాధుస న్యాసులనూ పిలిచి, చేయి చూపించు కుంటూ వుంటుంది.

పెళ్ళయిన పదిహేను రోజుల్లోనే పార్వతి కాపురానికి వచ్చింది. ఇక రోజూ తను దద్ధో జనంతో కాకుండా, రకరకాల కూరలతో, పచ్చళ్ళతో సుష్టుగా భోజనం చేయవచ్చని, ఆశపడ్డాడు ధనంజయం.

అయితే, తెల్లవారి పార్వతి నిద్రలేస్తూనే, "మీ దద్ధోజనం వంట అద్భుతం అంటూ పెళ్ళిళ్ళ పేరయ్య చెప్పాడు. నాకు మీ చేతి వంట రుచి చూపించరూ!" అన్నది ధనం జయంతో.

మాచిరాజు కామేశ్వరరావు



ఒకరోజు పార్వతి పుట్టింటికి ప్రయాణం అవుతూ, ధనంజయంతో, "రేపు సాయంత్రం తిరిగి వచ్చేటప్పుడు, మా అమ్మను తీసుకు వస్తాను. మేము వచ్చేలోగా దద్ధోజనం సిద్ధంగా వుంచు," అన్నది.

అయితే, చీకటి పడ్డాక కూడా తల్లీ కూతుళ్ళ జాడలేదు. ధనంజయం కడుపు నిండా దద్ధోజనంతిని, మిగతాదిగిన్నెలో సర్ది మూత పెట్టేశాడు.

అతడు ఇక పడుకునేందుకు తలుపులు మూయబోతూండగా, "మాదాకబళం, తల్లీ!" అన్న బిచ్చగాడి కేక వినిపించింది. ధనంజయం ఒక పళ్ళెంలో దద్ధోజనం వేసి తెచ్చాడు.

అది విని గర్వంగా తలపంకించి దద్ధోజనం సిద్ధం చేశాడు, ధనంజయం. అయితే, మరొక వారం గడిచినా పార్వతి వంటింటి కేసి వెళ్ళలేదు. విసిగిపోయిన ధనంజయం, "ఈ రోజు నువ్వు వంట చేయవలసిందే!" అని పార్వతికి చెప్పి, సంచి తీసుకుని బజారుకు వెళ్ళాడు.

అతను తిరిగి వచ్చేసరికి, మంచినీళ్ళ కుండలో చేయి పెట్టుకు కూర్చుని వున్నది, పార్వతి. చెయ్యి కాలిందట! అది మానడానికి పదిరోజులు పట్టింది.

ఆ తర్వాత నెలలో నాలుగైదు రోజులు మాత్రం, అతికష్టం మీద పార్వతి వంట చేసేది.

అది చూస్తూనే బిచ్చగాడు ముఖం చిట్లించి, "చూడబోతే అమ్మగారు ఇంట్లో లేనట్టున్నారు. ఈరోజూ దద్ధోజనమేనా?" అన్నాడు.

"అమ్మగారు వున్నా లేకపోయినా, దద్ధోజనం వండే తద్దినం నాదే కదా!" అంటూ ధనంజయం బిచ్చగాడి బొచ్చెలో దద్ధోజనం వేసి, లోపలికి వెళ్ళి చిరాగ్గా తలుపు మూసుకున్నాడు.

ఒక అర్ధరాత్రి వేళ ఎవరో తలుపు తట్టినట్టయి, ధనంజయం వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా ఒక ముసలి పిశాచం! దాన్ని చూస్తూనే హడలిపోయి కెవ్వుమన్నాడు ధనంజయం.

"ఉష్, గొడవ చెయ్యకు! నీ చేతి దద్ధో జనం రుచి చూసి పోదామని వచ్చాను," అన్నది ముసలిపిశాచం.

ధనంజయం ఒక పళ్ళెంలో దద్ధోజనం వేసి తెచ్చాడు. పిశాచం దద్ధోజనం తిని, "ఆహా, అమోఘం! ఓహో, ఏమి రుచి!" అంటూ పొగిడి వెళ్ళిపోయింది.

ధనంజయం నడిరాత్రి వేళ మంచి నిద్రలో వుండగా, మొహం మీద వెలుగు పడడంతో కళ్ళు తెరిచాడు. ఎదురుగా గ్రామదేవత గంగులమ్మ!

ధనంజయం, ఆమెకు చేతులు జోడించి, "తల్లీ ఇన్నాళ్ళకు ఈ భక్తుడి మీద దయ కలిగిందా?" అన్నాడు.



అందుకు గ్రామదేవత చిరునవ్వు నవ్వి. "నీపట్ల నా దయ ఏనాడూ వున్నదే! ప్రస్తుతం సంగతి — నీ దద్ధోజనం రుచి చూడాలన్న కోరిక కలిగింది. గుళ్ళో నా భక్తులు నీ దద్ధోజనంరుచి గురించి గొప్పగా చెప్పుకోవడం, చాలాసార్లు నా చెవిని పడింది," అన్నది.

గ్రామదేవత ఇలా అనగానే ధనంజయం గుండెలు గతుక్కుమన్నాయి. గ్రామదేవత రోజూ దద్ధోజనం చేసి నైవేద్యంగా గుడికి పంపమంటుందేమో అన్న భయం కలిగిం దతడికి.

ఇది గ్రహించిన గ్రామదేవత, "ఈ ఒక్క సారికే, మళ్ళీ మళ్ళీ రానులే," అన్నది.

ధనంజయం మిగిలి వున్న దద్ధోజనం పళ్ళెంలో వేసి తెచ్చాడు. గ్రామదేవత దాన్ని ఆరగించి, "నా భక్తుడివి కనకే, నలభీమ పాకాన్ని మరపించేలా దద్ధోజనం వండ గలుగుతున్నావు. మెచ్చాను, వస్తాను!" అంటూ అదృశ్యమైంది.

మర్నాడు ధనంజయం కచ్చేరీలో వుండగా, పార్వతి పక్కింటి కుర్రవాడితో, తనూ తల్లీ వచ్చినట్టూ, సాయంత్రం త్వరగా ఇంటికి రావలసిందిగా అతడికి కబురు చేసింది. ధనంజయం చీకటి పడబో తుండగా ఇల్లు చేరి, వంటింట్లోంచి పప్పు పులుసూ, వంకాయ కూరల వాసన రావడం చూసి ఆశ్చర్యపోయాడు.

అతడు, పార్వతిని సమీపించి, "నువ్వెం దుకు శ్రమ పడుతున్నావు? నేను దద్ధోజనం చేసే వాడినిగా," అన్నాడు.

పార్వతి, "మీరు జన్మలో మళ్ళీ, ఆ దద్ధోజనం మాట ఎత్తకండి. నా మీద ఒట్టు! మీరు మా అమ్మతో కబుర్లు చెబుతూ కూర్చోండి. వంట క్షణాలమీద చేసేస్తాను," అన్నది.

ధనంజయం తన చెవులను నమ్మలేక పోయాడు. హఠాత్తుగా భార్యలో కలిగిన మార్పు అతడికిఆనందాన్నీ,అంతకన్న ఆశ్చ ర్యాన్నీ కలిగించింది. తన దద్ధోజనం రుచి మెచ్చుకున్న పిశాచమో లేక గ్రామదేవతో, తనకు మేలుచేసివుంటారనుకున్నాడతను.

అయితే, భార్య మనసు మారడానికి వాళ్ళు కారణం కాదనీ, రాత్రి వచ్చిన బిచ్చ గాడనీధనంజయంఊహించలేకపోయాడు.

ఆ బిచ్చగాడు పగలు మీసాలూ, గడ్డం పెట్టుకుని భిక్ష స్వీకరిస్తాడు. చీకటి పడగానే అవి తీసేసి మాదాకబళం బిచ్చగాడి అవ తారం ఎత్తుతాడు.

ఆ మధ్యాహ్నం ఇంటికి తిరిగొచ్చిన పార్వతి, ఆ బిచ్చగాణ్ణి ఎవరో సాధువు అనుకుని పిలిచి, అరటిపళ్ళూ, మజ్జిగా ఇచ్చి, తన భవిష్యత్తు గురించి అడిగింది.

బిచ్చగాడు, ఆమె చేతి రేఖలను పరీక్షిస్తు న్నట్టు నటించి, "నువ్వు చూడబోతే మహా లక్ష్మిలావున్నావు. నీభర్తకు దద్ధోజనగండం వుంది. అతను ఏదో ఒకరోజు దద్ధోజనం చేస్తూనో, తింటూనో హరీ అంటాడు!" అని చెప్పాడు.

వాడికి ఆ ఇంట రోజూ రాత్రివేళ దద్ధో జనంకాక, రకరకాల పదార్థాలు దొరకాలన్న ఆశ కలిగింది.

బిచ్చగాడి మాటలు వింటూనే పార్వతికి ముచ్చెమటలు పోశాయి. ఇక జన్మలో భర్త చేత దద్ధోజనం చేయించకూడదని నిర్ణ యించుకున్నది.

ఆ విధంగా దద్ధోజనం చేయడం మాని ఎంతో కాలం గడిచినా, ఊళ్ళో వాళ్ళు మాత్రం ఇంకా ధనంజయాన్ని, దద్ధోజనం ధనంజయం అనే పిలుస్తారు.





# పెరట్లో పిశాచం

ఒకచిట్టడవిలోవందలాదిపిశాచాలున్నాయి. ఒక తల్లిపిశాచం తిట్టిందని కోపం వచ్చి పిల్లపిశాచం ఒకటి అడవి వదిలి ఊళ్ళోకి వెళ్ళి, ఒక ఇంటి పెరట్లోని వేపచెట్టు మీద కూర్చున్నది.

ఆ ఇల్లొక పేదరైతు పేరయ్యది. వాడి పెద్ద కూతురుకు పెళ్ళయింది కానీ, అత్త వారు మాటిమాటికీ డబ్బు తెమ్మనే వాళ్ళు. దాని పేరు లక్ష్మి. ఒకనాడు అత్తవారు వెయ్యివరహాలు పట్టుకురమ్మని లక్ష్మిని పుట్టింటికి తరిమేశారు.

లక్ష్మికింకా పెళ్ళి కావలసిన చెల్లెళ్ళిద్ద రున్నారు. పేరయ్యకు పెద్దకూతురి పెళ్ళి అప్పే ఇంకా తీరలేదు. వాడు మిగతా వాళ్ళ పెళ్ళిళ్ళేం చేయగలడు! అయినప్పటికీ మిగిలివున్న ఇల్లమ్మేసి, లక్ష్మికి వెయ్యి వర హాలూ యిచ్చి అత్తవారింటికి పంపాలను కున్నాడు.

కానీ లక్ష్మి అందుకు ఒప్పుకోక, "నాన్నా! నా అత్తమామల ధనదాహం తీరేది కాదు. అలాంటి దానికోసం ఇల్లమ్ముకుని ఉన్న ఆశ్రయం పోగొట్టుకుంటే, రేపు చెల్లెళ్ళ పెళ్ళిళ్ళెలా చేస్తావు? కాబట్టి నా అత్తవారి సంగతి నువ్వూ, నేనూ కూడా మరిచి పోదాం. నేనూ మీతోనే వుండిపోతాను!" అన్నది.

"నువ్వలా చేస్తే నీ చెల్లెళ్ళకు పెళ్ళి సంబంధాలురావు. మనకుటుంబానికి చెడ్డ పేరు వస్తుంది," అన్నాడు పేరయ్య.

దానికి లక్ష్మి చెల్లెళ్ళిద్దరూ, "పెళ్ళి చేసు కుని అక్క ఎంతసుఖపడుతున్నదో చూశాం గదా! మేముపెళ్ళిచేసుకోము. నీతోనే వుండి నిన్ను సుఖపెడతాం," అన్నారు.

పేరయ్య చిరాగ్గా, "అత్తవారన్నాక ఆ మాత్రం ఆరడి పెట్టరా? అందుకని కాపు రాలు పాడుచేసుకుంటారా? కాలంతోపాటు

"వసుంధర"



మీది పిల్లపిశాచం చూసింది. సహజమైన పిశాచగుణం వల్ల, అది లక్ష్మిని ఏడిపించా లనుకుని చెట్టుమీది నుంచి కిందికి దూకి, దానికి ఎదురుగావికృతంగా పళ్ళు చూపిస్తూ నాట్యం చేసింది.

లక్ష్మి హడలిపోయి కెవ్వున కేకపెట్టి, ఇంట్లోకి పరిగెత్తింది. ఇంటిల్లిపాదీ నిద్ర లేచారు. వాళ్ళు ఏం జరిగిందని అడిగితే, "పెరట్లోపిశాచం!" అన్నది లక్ష్మి ఇంకా వణికి పోతూనే.

"మన ఇంటి పెరట్లో పిశాచాలేనాడూ లేవే? నేను వెళ్ళి చూసివస్తానుండు," అని లక్ష్మి వారిస్తున్నా వినకుండా పేరయ్య వేప చెట్టువద్దకు వెళ్ళాడు.

ఇంట్లో మిగతా వాళ్ళెవరూ, వాడి వెంట వెళ్ళడానికి సాహసించ లేదు.

పిల్లపిశాచం పేరయ్యను చూస్తూనే, వాడిని హడలెత్తించాలనుకుని, వాడి ముందు దూకింది. కానీ పేరయ్య దాన్ని చూసి ఏ మాత్రమూ చలించక, "ఏమిటీ ఒక్క దానివే వచ్చావా! నీకేమీ తోచడంలేదా?" అన్నాడు.

పిశాచం వాడి ధైర్యానికి తెల్లబోయి, తన కథంతా చెప్పుకున్నది. పేరయ్య నవ్వి, "తప్పు! వెంటనే అడవికి పోయి నీ తల్లిని చూడు. అది నీ కోసం ఏడుస్తూ వుంటుంది. నాలుగు మాటలన్నా తల్లిప్రేమకు సాటి వచ్చేది, ఈ లోకంలో వుండదు. తల్లి తిట్టినా నీక్కోపం రాకూడదు," అన్నాడు.

అన్నీ అవే సర్దుకుంటాయి. నువ్వు పెద్దల మాటను గౌరవించాలి. రేపు ఇల్లమ్మి నీకు వెయ్యి వరహాలూ యిస్తాను. వెళ్ళి బుద్ధిగా అత్తవారింట వుండు. అట్టే వాదించకు," అన్నాడు లక్ష్మితో.

తనవల్ల తండ్రికేఆశ్రయమూ లేకుండా పోతుందన్నదిగులుతో, ఆరాత్రి లక్ష్మికి నిద్ర పట్టలేదు. అర్ధరాత్రయ్యేసరికి లక్ష్మికి ఆత్మ హత్య చేసుకోవాలనిపించింది. తను చస్తేనే తండ్రి సుఖపడతాడని దానికి తోచింది.

పేరయ్య ఇంటి పెరట్లో పెద్ద చెట్టునాను కున్న ఒక నుయ్యి వున్నది. అందులో దూకి ప్రాణాలు తీసుకోవాలనుకున్నది లక్ష్మి. అయితే లక్ష్మి నూతిదగ్గరకురావటం, చెట్టు

ఏమనుకుందో, పిల్లపిశాచం తల్లి వద్దకు వెళ్ళేసరికి, అప్పటికది నిజంగానే ఏడుస్తు న్నది. జరిగింది తెలుసుకున్నాక తల్లి పిశాచం, "నిన్ను మళ్ళీ నా దగ్గరకు పంపిన, ఆ పేరయ్యకు కృతజ్ఞతగా కొంత బంగారం యిచ్చుకోవాలి," అంటూ ఒక మూట తీసుకుని బయలుదేరింది. పిల్లపిశాచం తల్లిని అనుసరించింది.

పిశాచాలు వెళ్ళేసరికి పేరయ్య, లక్ష్మిని మందలిస్తున్నాడు. మనిషిబ్రతికిసాధించాలి తప్ప, చచ్చిసాధించేదేమీ వుండదన్నాడు.

ఆ సమయానికి తల్లిపిశాచం వచ్చి, పేర య్యకు కృతజ్ఞతలు చెప్పుకుని, బంగారం మూట ఇచ్చింది. అది చూసి పేరయ్య ఆశ్చర్యపోయి, "నేను నీకు కృతజ్ఞుణ్ణి. ఈ బంగారం విలువ లక్ష వరహాలు చేస్తుంది. జీవితకాలం కష్టపడ్డా ఇంత డబ్బు సంపా యించడం నావల్ల కాదు," అన్నాడు.

పిల్లపిశాచంకొంతకాలం పేరయ్య ఇంట్లో వుండిపోతానన్నది. తల్లిపిశాచం దాన్ని వారిస్తూ, "మనవల్లమనుషులకు ఉపకారం కాక అపకారం జరిగితే, ఆ పాపంతో పిశాచ జన్మ నుంచి ఎప్పటికీ విముక్తి రాదు," అని హెచ్చరించింది.

"కానీ, ఈ పిల్లపిశాచం వల్లనే, నా కూతురి ప్రాణాలు దక్కాయి. లేకుంటే అది ఆత్మహత్య చేసుకుని వుండేది. కొన్నాళ్ళు దీన్ని మాతో వుండనీ," అన్నాడు పేరయ్య.

అందుకు తల్లిపిశాచం, "ఇది కోపంతో నన్ను వదిలిపెట్టింది కాబట్టి, మీకు మేలు



జరిగింది. కానీ మంచి చేయాలనుకున్నా, మేమెంతోసేపు అలా వుండలేం. మనుషుల నేడిపించి వినోదించాలన్నదే పిశాచాల బుద్ధి!" అన్నది.

అయినా, పిల్లపిశాచం మనుషుల మధ్య కొంతకాలముంటానని మారాం చేసింది. అప్పుడు పేరయ్య, "పోనీ ఒక పని చెయ్యి. దీన్ని నా కూతురుతోపాటు అత్తవారింటికి పంపించు. వాళ్ళు, నా కూతుర్ని ప్రతిదానికీ వేధిస్తున్నారు. అలావేధించినప్పుడల్లా, దీన్ని వాళ్ళను వేధించమను. ఆ విధంగా దీని కోరికా తీరుతుంది; మనుషులకుపకారమూ జరుగుతుంది," అన్నాడు.

తల్లిపిశాచం సరేనన్నది. పిల్లపిశాచం, "ఇదిబాగుంది. ఈ ఇంట్లో వాళ్ళకు నేనంటే భయం పోయింది. భయ పడేవాళ్ళుంటేనే, నాకు కాలక్షేపం అవుతుంది," అన్నది.

పిల్లపిశాచం, లక్ష్మితోపాటు దాని అత్త వారింటికి వెళ్ళింది. ఆ ఇంటి పెరటి గోడ నానుకుని, ఒక చింత చెట్టున్నది. అది ఆ చెట్టుమీద మకాం పెట్టింది.

లక్ష్మి అత్తమామలు మొదట్లో కోడలు పుట్టింటి నుంచి తెచ్చిన వెయ్యి వరహాలూ చూసి సంతోషించినా, క్రమంగా ఆమెను సూటీ పోటీ మాటలతో వేధించసాగారు. ఇలా జరిగినప్పుడల్లా పిల్లపిశాచం రాత్రివేళ ఇంట్లో ప్రవేశించి, వస్తువులను చిందర వందర చేయడం, చింత కొమ్మలను విరిచి పెరట్లో పడవేయడం ప్రారంభించింది.

ఇది చూసి లక్ష్మి అత్త భయపడిపోయి, జరుగుతున్న దాన్ని గురించి పొరుగిళ్ళ వాళ్ళకు చెప్పుకున్నది. వాళ్ళు ఆలోచించి, "బహుశా నీ కోడల్ని నువ్వు వేధించి తెమ్మన్న కట్నం డబ్బు పిశాచంగా మారిం దేమో! ఇక నుంచి అయినా కోడల్ని ప్రేమగా చూడడం నేర్చుకో!" అని సలహా ఇచ్చారు.

ఆవిధంగా లక్ష్మిజీవితంసుఖప్రదమైంది. పిల్లపిశాచం కొంతకాలముండి, తిరిగి అడవికి వెళ్ళిపోతూ, "ఇలాంటి వాళ్ళు లేక పోతే, పిశాచాలకు మనుషులకు మధ్య వుండాలనే కోరిక తీరదు కదా. ఇందుకు వీళ్ళను మెచ్చు కోవాలి!" అనుకున్నది.





# వీరహనుమాన్

యుద్ధంలో మైరావణుడు మరణించిన వార్త సువర్చలాదేవి ద్వారా చంద్రసేన విన్నది. సువర్చల ఆమెకు లంకారాజ్యానికి మత్స్యవల్లభుడు పట్టాభిషిక్తుడైనట్టు కూడా చెప్పింది.

మైరావణుడి చెర నుంచి తనకు విముక్తి కలిగిందని ఆనందపడుతున్న చంద్రసేనతో, సువర్చల, "అమ్మా, నువ్వు అదృష్టవంతురాలివి. మైరావణ సంహారం చేసి, రామచంద్రుడు సరాసరి నీ భవనానికే వస్తున్నాడు," అన్నది.

ఈ శుభవార్త చెప్పి సువర్చలాదేవి వెళ్ళిపోగానే, చంద్రసేన సంతోషంతో ఉక్కిరిబిక్కిరవుతూ, రాముడికి తగిన విధంగా స్వాగతం చెప్పేందుకు సన్నాహాలు ప్రారంభించింది. ముందుగా తానున్నమందిరంలో పూలతోరణాలు కట్టింది. చందనతాంబూలాలనూ, పరిమళ అభిషేక జలాన్నీ సిద్ధపరిచింది.హంసతూలికాతల్పంమీద పూలు చల్లింది.

ఈ పనులన్నీ పూర్తికాగానే చంద్రసేన ఒక బంగారు పళ్ళెంలో పూవులూ, పన్నీరు కలశం పెట్టుకుని రాముడి రాక కోసం చూస్తూ, ద్వారం వద్ద నిలబడింది. ఒకటి రెండు నిమిషాలు గడిచే లోపలే ముందు హనుమంతుడూ, వెనకగా రాముడూ రావటం ఆమె కంటబడింది. రాముణ్ణి చూస్తూనే, చంద్రసేన సిగ్గుతో తడబాటు చెంది, ఆనంద తన్మయత్వంలో చేతులు మోడ్చి, మోకరిల్లి కూర్చున్నది.

## 33. రామలక్ష్మణుల ఆగమనం



హనుమంతుడు ముందుగా గదిలో ప్రవే శించి చంద్రసేనకు నమస్కరించి, "అమ్మా, నీకు చేసిన వాగ్దానం ప్రకారం రామ చంద్రుణ్ణి, నీ మందిరానికి తీసుకు వచ్చాను," అన్నాడు.

ఆ మాటలు వింటూనే చంద్రసేన కళ్లు తెరిచింది. ఎదురుగా ఆమెకు రాముడు శాంతగంభీర వదనంతో సాక్షాత్కరించాడు. వెంటనే ఆమె తొట్రు పడుతూ రాముడి పాదాలను బంగారు పళ్ళెరంలో కడిగి, ఆ నీటిని తలపై చల్లుకుని, అతడిని పూలతో పూజించి, కర్పూర హారతి ఇచ్చింది.

చంద్రసేన ఆనంద పారవశ్యంలో ఏదో మాట్లాడబోయి, పెదవులు తడబడగా మాట్లాడలేక పోయింది. ఆమె మౌనంగా రాముణ్ణి ఆహ్వానించుతూ హంసతూలికా తల్పం దగ్గిరకు తీసుకుపోయింది. అక్కడ శయ్య పైన వున్న ఒక పుష్పహారాన్ని తీసుకుని రాముడి మెడలో వేసేందుకు కదిలింది.

ఈ లోపల రాముడు హంసతూలికా తల్పాన్ని సమీపించి, దాని మీద కూర్చోబో తూండగా, అది ఫెళఫెళమంటూ మధ్యకు విరిగిపోయింది.

చంద్రసేన ఏమి జరిగినదీ తెలియని పారవశ్యంలో, రాముడి మెడలో పూలమాల వేయబోతూండగా అతడామెను వారించి, "చంద్రసేనా! చూశావుగద? శకునం ఏ మాత్రం బాగాలేదు," అన్నాడు.

ఆ మరుక్షణం చంద్రసేన చేతుల నుంచి పూలమాల జారి, రాముడి పాదాల మీద కుప్పగా పడింది.

అప్పటికి చంద్రసేన తెప్పరిల్లి, విరిగి పోయిన హంసతూలికా తల్పాని కేసి తీవ్రంగా చూసింది.

తల్పాన్ని విరిగిపడేలా చేసిన హను మంతుడు అక్కడే సూక్ష్మరూపంలో దాగి వున్నాడు. అతడు చంద్రసేన తీవ్రదృష్టిని భరించలేకపోయాడు.

హనుమంతుడు వెంటనే తన సూక్ష్మ రూపాన్ని విసర్జించి, మామూలు రూపంతో చంద్రసేన ముందు మోకరిల్లి, "తల్లీ, నన్ను

క్షమించు! అవసరం కొద్దీ వాగ్దానం చేశాను. ఆ ప్రకారం రాముణ్ణి నీ దగ్గిరకు తీసుకు వచ్చాను. కాని, రాముడు ఏకపత్నీవ్రతుడు. ఫలాపేక్షలేకుండా ఆయన్ని సేవించటమే ఉత్తమ పద్ధతి," అన్నాడు.

చంద్రసేన ఏదో చెప్పాలని చూసింది కాని, గొంతు తడబడింది. రాముడు తేజోవంతమైన శాంతనయనాలతో చూస్తూ ఆమెకు పరతత్వజ్ఞానాన్ని బోధించాడు. ఆ సమయంలో చంద్రసేనకు, రాముడు మహావిష్ణువులా కనిపించాడు. ఆ విష్ణువు, చంద్రసేనతో, "చంద్రసేనా! ఇప్పుడు రాముడుగా నేను ఏకపత్నీవ్రతుణ్ణి. రాబోయే కృష్ణావతారంలో, నా అష్ట భార్యల్లో నీవు సత్యభామవై, నాకెంతో ప్రియతమురాలివవుతావు," అన్నాడు.

ఆ సమయంలో చంద్రసేనకు, తనలో విష్ణువు నిండివున్నట్టుగానూ, తాను ఒక జ్యోతిలాగా విష్ణుతేజంలో కలిసిపోతున్నట్టుగానూ అనిపించింది. ఆమె జ్యోతిలా ప్రకాశిస్తూ, రాముడిలో లీనం కావటం చూస్తున్న హనుమంతుడు, అద్భుతపడిపోతూ కళ్ళు మూసుకుని, చేతులు జోడించాడు. కొద్ది క్షణాల తరవాత అతడు కళ్ళు తెరిచి చూస్తే, ఎదురుగా రాముడు చిరునవ్వు నవ్వుతూ కనిపించాడు. వెంటనే హనుమంతుడికి అంతకు ముందు జరిగినదంతా గుర్తు లేకుండాపోయి, రావణ



సంహారం సంగతి మాత్రమే మనసులో మెదిలింది.

అంతలో అక్కడికి పాతాళ లంకా రాజ్యానికి రాజయిన మత్స్యవల్లభుడు వచ్చాడు. అతడు రాముణ్ణీ, హనుమంతుణ్ణీ పూలతో అర్చించి, వారి నుండి ఆశీర్వాదాలు పొందాడు. తరవాత అతడు పాతాళలంకావాసులతో కలిసి రాముడికి ఘనంగా వీడ్కోలు ఇచ్చాడు. హనుమంతుడు రామలక్ష్మణులను భుజాలపై ఎక్కించుకుని, పాతాళలంకను దాటి, రావణ లంకకేసి రివ్వుమంటూ ఆకాశంలోకి ఎగిరాడు. మత్స్యవల్లభుడు చేతులెత్తి ఊపుతూ, అతడికి జయజయధ్వానాలు పలికాడు.



హనుమంతుడు లంకానగరాన్ని చేర నున్న సమయంలో, అక్కడ వున్న వానరసేనతోపాటు, వానర ప్రముఖు లందరూ తీరని విచారంలో ఉన్నారు. వారిలో కొందరు ఆకాశంకేసి ఆశగా చూస్తున్నారు. జాంబవంతుడు మాత్రం మందహాసం చేస్తూ, వానరులకు ధైర్యం చెబుతున్నాడు.

అక్కడ లంకానగరంలో రాక్షసులు బాకాలు ఊదుతూ, ఆనందంకొద్దీ దిక్కులు పిక్కటిల్లేలా కేకలు పెడుతున్నారు. వారిలో కొందరు పెద్ద పెద్ద పాత్రలలో మద్యం తాగుతూ, పాటలు పాడుతూ నాట్యం చేస్తు న్నారు.

రావణుడు అమితోత్సాహంలో ఉన్నాడు. కాళికి బలిగా పెట్టిన రామలక్ష్మణుల తలలతో మైరావణుడు ఏ క్షణాన అయినా తన దగ్గిరకు రావచ్చని అతడు ఎదురు చూస్తున్నాడు. రామలక్ష్మణుల తలలను బంగారు పళ్ళెంలో వుంచి, దానిని సీత దగ్గిరకు తీసుకుపోయేందుకు అవసరం అయిన ఏర్పాట్లు కూడా ఉత్సాహంగా పూర్తిచేశాడు.

కాలం గడుస్తున్నది. రావణుడు తన మందిరం నుంచి బయటికి వచ్చి, కోట గోడ అంచున నిలబడి, దూరంగా కనిపిస్తున్న వానరసేనను పరికించి, తృప్తిగా నవ్వుకున్నాడు. తలలు వంచుకుని విచారంగా నిలబడి వున్న వానరసేనకు ఒకపక్కగా విభీషణుడు నిలబడివున్నాడు. రావణుడు అతణ్ణి గుర్తించి, "ఔరా, తమ్ముడా విభీషణా, నువ్వెంత అమాయ కుడివి! ఇంకా అక్కడ పడిగాపులు గాయటం ఎందుకు? పాతాళలంక కాళీ ప్రసాదంగా రామలక్ష్మణుల తలలు నా దగ్గిరకు రానున్నవి. తలమాంసం అత్యంత రుచికరమైనదని నీకు తెలియంది కాదు గదా. ఆ తలలమాంసం రుచిచూసేందు కైనా, త్వరగా లంకానగరం చేరుకో. నీకేం భయం లేదు. ఎంతైనా నువ్వు. నా తమ్ముడివి. అభయం ఇస్తున్నాను. ఇక నుంచి అయినా యువరాజుగా నా పట్ల

వినయవిధేయతలతో మసులుకో. వెంటనే నగరానికి బయలుదేరు," అంటూ, నాలుగు యోజనాల దూరం వినిపించేంత బిగ్గరగా అరిచాడు.



రావణుడి మాటలు వింటూనే విభీషణుడు చెవులు మూసుకున్నాడు. అతడి కళ్ళలో నీళ్ళు తిరిగాయి; దుఃఖం పెల్లుబికింది. విభీషణుడి దైన్యం చూసి సుగ్రీవుడికి కూడా గుండె జారిపోయింది. వాళ్ళిద్దరి దుఃఖం చూసి మిగతా వానరులు హాహాకారాలుచేస్తూ, ఒకరిని చూసి ఒకరు ఏడ్వటం మొదలుపెట్టారు.

వానరసేన దీనస్థితి చూసి రావణుడు మరొకసారి తృప్తిగా నవ్వుకున్నాడు. కోట గోడ పక్కగా పోతున్న రాక్షస స్త్రీలను కేక వేసి పిలిచి, "మీరిప్పుడే సీత దగ్గిరకు వెళ్ళి, ఈ సంగతి చెప్పండి. రాముడి తలతోపాటు లక్ష్మణుడి తలను కూడా ఆమెకు కానుకగా పంపబోతున్నాను. వాళ్ల శరీరాలను పాతాళ లంకలోని రాక్షసులు విందు భోజనంగా తినేసివుంటారు. సీతకు ఈ వార్త చెప్పి, రామలక్ష్మణుల తలలు స్వీకరించేందుకు సిద్ధంగా వుండమనండి," అన్నాడు ఉత్సాహంగా.

రాక్షస స్త్రీలకు ఆ క్షణంలో రావణుడి ఆనందం వెనక కొద్దిపాటి మతిచాంచల్యం వున్నట్టు కనిపించింది. వాళ్ళు ఒక క్షణకాలం తటపటాయించి, రావణుడికి వంగి నమస్కారాలు చేసి గబగబా అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

రావణుడు కోట గోడ మీది నుంచి కదిలి, తిరిగి తన మందిరానికి పోయి, గవాక్షం దగ్గిర కూర్చుని, మైరావణుడి రాక కోసం సముద్రం మీది ఆకాశపు అంచు కేసి ఆశగా చూడసాగాడు. అంతలో అతడికి, ఆకాశంలో నలుసులాంటి ఆకారం ఒకటి ఎగిరి వస్తూండటం కంటబడింది.

రావణుడు దిగ్గున గవాక్షం ముందు లేచి నిలబడి, చప్పట్లు చరుస్తూ, "అదుగో, మైరావణుడు కాళికి బలిచేసిన రామలక్ష్మణుల తలలు తెస్తున్నాడు. బంగారు పళ్ళెం ఎక్కడ? తలలను అందులో



అంగదుడు ఉత్సాహం పట్టలేక, విజయ ధ్వానం చేసి, "మన హనుమంతుడు రామ లక్ష్మణులతోవస్తున్నాడు.స్వాగతంచెప్పండి," అంటూ కేక పెట్టాడు.

రామలక్ష్మణులను భుజాలపై ఎక్కించు కుని వస్తున్న హనుమంతుణ్ణి చూసి, వానర సైన్యం ఆనందంతో ఎగిరి గంతులు వేసింది. జయజయ ధ్వానాలు మిన్ను ముట్టాయి. అక్కడ లంకానగరంలో రాక్ష సుల ఆనందోత్సవాలు హఠాత్తుగా ఆగి పోయాయి.

వానరసేన ఉత్సాహంతో వేసే కేకలూ, అక్కడ రేగిన కోలాహలం వింటూ రావణుడు తన మందిరంలోని గవాక్షం దగ్గిర స్థాణువులా నిలబడిపోయాడు. అతడికి రామలక్ష్మణులు సజీవులని మాత్రం అర్థమైంది. కాని, మైరావణుడూ, అతడి అన్నా ఏమైనట్టు? వాళ్ళను హను మంతుడు గాని, రామలక్ష్మణులు గాని సంహరించారా?

రావణుడు ఇలా ఆలోచిస్తున్నంతలో రాక్షస సైనికుడొకడు అతడి దగ్గిరకు వచ్చి, తాను వానరసైనికుల మాటల ద్వారా విన్న దంతా చెప్పాడు. ఆ విధంగా రావణుడికి పాతాళలంకలో జరిగినదంతా తెలిసింది. వెంటనే అతడు భయకంపితుడైపోయి, చిన్నగా కేకపెట్టి కూర్చున్న ఆసనం నుంచి కిందపడి మూర్ఛపోయాడు.

పెట్టాలి. త్వరగా పళ్ళెం తెండి!" అని, అంతలోనే బిక్కచచ్చి, హతాశుడై కూల బడ్డాడు.

సముద్రం మీది ఆకాశం కేసి చూస్తూ నిలబడివున్న జాంబవంతుడు, ఆకాశంలో నలుసు లాంటి రూపం కనిపించగానే ఆ రూపం ఎవరిదో గుర్తించి, పక్కకు తల తిప్పాడు. పక్కనే నిలబడి సముద్రంకేసి చూస్తున్న అంగదుడు ఆశ్చర్యంగా జాంబ వంతుడికేసి చూశాడు.

జాంబవంతుడు చేతులెత్తి, వానరులతో, "అదుగో, చూడండి. హనుమంతుడు వస్తున్నాడు. ఇక విచారం మానండి," అన్నాడు.

కొంతసేపటికి రావణుడు మూర్ఛ నుంచి తెప్పరిల్లాడు. ఇప్పుడతడిలో కోపం, ద్వేషం పరవళ్ళు తీయసాగాయి. అతడు పిడికెళ్ళు బిగించి, పళ్ళుకొరుకుతూ, "నా ప్రేమాస్పదుడైన ఇంద్రజిత్తును చంపిన, ఆ లక్ష్మణు డెక్కడ? వాణ్ణి ఎక్కడ దాగి వున్నా చంపి తీరుతాను. వాడెక్కడో వానరసేన మధ్యంలో పెరికిపందలా దాగి వుంటాడు. వాణ్ణి నాకంట పడమనండి. వాడి ఆయువు ఈ క్షణంతో ముగిసినట్టే!" అంటూ, ఉన్మాదిలా అరవసాగాడు.

రావణుడి ఈ దుస్థితి చూసి మండోదరి విస్తుపోయి, కంట నీరు పెట్టుకున్నది. రావణుడు ఆమెను చూసీ చూడనట్టే, కాళ్ళతో భూమిని తన్నుతూ, "ఆ లక్ష్మణుణ్ణి చంపటానికి నాకు ఎవరి సహాయమూ అక్కర లేదు. నేనొక్కణ్ణే యుద్ధంలో ఆ రామలక్ష్మణులను చంపి, వాళ్ళ తలలను సీతకు పంపుతాను. మధ్యలో ఈ మైరావణుడు వచ్చి నాకు లేనిపోని ఆశలు కల్పించి, నా అమూల్యమైన కాలమంతా వృధా చేశాడు. వాడూ, వాడి అన్నా అసమర్థులూ, పెరికి పందలూ కనకే, వాళ్ళను రాముడు సునాయాసంగాచంపగలిగాడు. సరే, ఆ మైరావణ భ్రష్టుడి సంగతివదిలేస్తాను. నా సుపుత్రుడు ఇంద్రజిత్తును చంపిన, ఆ లక్ష్మణుణ్ణి ముందుగా నా ఆయుధానికి బలి పెట్టాలి. ఎక్కడ ఆ దుర్మార్గుడు?" అంటూ పిచ్చిగా కేకలు పెట్టాడు.

వానరసేన యుద్ధానికి సర్వసన్నద్ధమై శంఖాలు పూరిస్తూ అమితోత్సాహంతో చేస్తున్న కోలాహలం రావణుడికి వినిపించింది. అది వింటూనే అతడి కళ్ళు నిప్పుల్లా మెరిశాయి. రౌద్రంతో శరీరమంతా అగ్ని జ్వాలలాగా ఎరుపెక్కింది. అతని కళ్ళలోని అశ్రుజలం పూర్తిగా ఇంకిపోయి, పౌరుషం కరుడుకట్టింది.

రావణుడు వెంటనే కవచం ధరించి, విల్లంబులు తీసుకుని, "ఆ లక్ష్మణు డెక్కడ?" అంటూ తన మందిరం నుంచి బయటికి వచ్చి, వానరసేన కేసి బయలుదేరాడు.






# మంత్రశక్తులు

ఒకప్పుడు నేపాళదేశం మాంత్రికులకు ప్రసిద్ధికెక్కినది. అక్కడ కొందరు సామాన్య ప్రజలకు కూడా కొన్ని కొన్ని శక్తులుండేవి. ఒక గ్రామంలో వర్ధకుడనే ఒక వయసు మళ్ళిన పశువుల కాపరి ఉండేవాడు. అతనొకనాడు పశువులను కాస్తూ, మిట్టమధ్యాహ్నంవేళ దాహంవేసి సత్రం బావి వద్దకు వచ్చి, సత్రం అరుగుమీద గ్రామపెద్దలు చేరి కబుర్లాడుకుంటుంటే తాను కూడా చతికిలబడ్డాడు.

"ఏంరా, వర్ధకుడా? మందను ఎవరి కప్పగించి వచ్చావు? ఇక్కడే కూర్చుంటివే?" అన్నాడొక గ్రామపెద్ద.

"మందకొచ్చిన భయమేమీ లేదు, నేనెక్కడ ఉన్నా పశువులు నామాట వింటాయి. కావలిస్తే చూపిస్తాను. రెండు కోడెదూడలను ఇక్కడికి రప్పించనా?" అన్నాడు వర్ధకుడు.

"ఏదీ రప్పించు!" అన్నారు ఊరివాళ్ళు.

వాళ్ళా మాటలన్నకాస్సేపటికల్లా దూరాన మువ్వల చప్పుడు వినిపించింది. రెండు కోడెదూడలు శరవేగంతో పరిగెత్తుకుంటూ వచ్చి సత్రం దగ్గిర ఆగి, వర్ధకుడి కేసి, మోరలెత్తి చూశాయి.

"ఇక పదండి. వెళ్ళి మీ మేత మీరు మెయ్యండి," అన్నాడు వర్ధకుడు. వెంటనే కోడెదూడలు వెనక్కు తిరిగి వెళ్ళిపోయాయి.

"అవి తిన్నగా మందఉండే చోటికి చేరుతాయో, లేక ఎవరి పొలం మీదనన్నా పడి పాడుచేస్తాయో?" అన్నాడొకాయన.

"అటువంటిది ఒక్కనాటికీ జరగదు," అన్నాడు వర్ధకుడు.

అతని మాటలు నమ్మలేక కొందరు మనుషులు కోడెల వెనకగా బయలుదేరారు. వర్ధకుడన్నట్టు అవి తిన్నగా మంద ఉన్న చోటికే వెళ్ళి, తమ యజమాని చెప్పినట్టు మేయనారంభించాయి.

నేపాళ జానపద కథ



వర్ధకుడు సాయంకాలం దాకా సంత లోనే గడిపి, సూర్యాస్తమయం కాబోతుండగా ఇంటిదారి పట్టాడు. వాడు షావుకారు గారింటికి వెళ్ళే సరికి, సంతలో కొన్న గిత్త షావుకారుగారి పశువుల దొడ్డికి చేరి, కొట్టంలో ప్రవేశించక, బయటనే పడుకుని ఉన్నది. వర్ధకుడు దాన్ని లేవగొట్టి కొట్టం లోకి తీసుకుపోయి, ఒక గుంజకు కట్టి, ఇంత మేత వేశాడు.

ఆగిత్త వర్ధకుడిచెప్పుచేతలలో ఉంటూం డేది. అటువంటిది ఒకనాడు వర్ధకుణ్ణి కుమ్మబోయింది. వర్ధకుడుఆశ్చర్యపడ్డాడు. అది మొదలు ఆ గిత్త వర్ధకుడు కనిపించి నప్పుడల్లా, ముక్కులు పెద్దవిచేసి బుసకొట్ట టమూ, తలవిసరటమూ కుమ్మబోవటమూ చేస్తూ వచ్చింది.

ఎవడో ప్రయోగం చేసి గిత్తను తన పైకి ఉసిగొల్పుతున్నాడని వర్ధకుడికి అర్థమ యింది. వాడు కంచెవార ఉన్న తుమ్మ చెట్టు నుంచి కొమ్మలు కోసి, కట్టకట్టి, పశువుల కొట్టం అంతా ఊడవసాగాడు. కొంచెం సేపటికల్లా, "చంపేస్తున్నాడురో, బాబో!" అంటూ ఒక వైపు నుంచి ఆర్తనాదం వినబడింది.

పశువుల కొట్టంలో పనిచేసే వాడే ఒక పాలేరు, "ఆపు! ఆపు!!" అంటూ కొట్టంలోకి వచ్చాడు. వాడి వీపంతా నెత్తురు ప్రవాహాలే! వర్ధకుడు ఊడ్చేది నేలనే అయినా, తుమ్మ

మరొకసారి ఇలాంటి సంఘటనే జరి గింది. ఊళ్ళో ఉండే పెద్దషావుకారు గిత్తను కొనదలిచి, వర్ధకుణ్ణి వెంటబెట్టుకుని, తన వాళ్ళతో సహా సంతకు వెళ్ళాడు. చాలా గిత్తలను చూసినాక వాళ్ళకు నచ్చిన గిత్త దొరికింది. బేరం కుదిరింది. షావుకారు గిత్తను కొని వర్ధకుడి కిచ్చి, "దీన్ని ఇంటికి తీసుకుపోరా," అని చెప్పి, తాను తన వాళ్ళతో బండిమీద బస్తీకి వెళ్ళిపోయాడు.

ఇంకా పొద్దు చాలా ఉన్నది. షావుకారు చీకటిపడి గానీ ఇల్లు చేరడు. అప్పుడే ఇంటికి వెళ్ళాలనిపించక వర్ధకుడు గిత్తతో, "నువ్వు మనింటికి పోవే. నేను వెనకగా వస్తాను," అన్నాడు. గిత్త వెళ్ళిపోయింది.

ముళ్ళు ఆ పాలేరు వీపును దారుణంగా గీకి వదిలిపెట్టాయి.

"నీ విద్యలు నా మీద చూపిస్తావట్రా? ఒళ్ళుదగ్గిరపెట్టుకునుండు. ఇంకోసారి గిత్త జోలికి వచ్చావంటే నీ ప్రాణాలు తీస్తాను," అని పాలేరును బెదిరించాడు వర్ధకుడు.

పాలేరు కూడా కొన్ని శక్తులు కలవాడే, కానీ వర్ధకుడు అంతకన్న రెరిడాకులు ఎక్కువ చదివినవాడు.

మరొకసారి ఇంకొక సంఘటన జరిగింది. గ్రామ పెద్దలు తమ పొలాలలో పండిన ధాన్యాన్ని బళ్ళకెత్తి బస్తీకి పంపారు. అయిదారు బళ్ళూ, పది పన్నెండు మంది మనుషులూ కలిసి బయలుదేరారు. వాళ్ళ వెంట వర్ధకుడు కూడా ఉన్నాడు. బళ్ళు మధ్యాహ్నం వేళకు రోడ్డుపక్కన ఉన్న ఒక చెరువుగట్టు చేరినై. అక్కడ ఎడ్లకు నీరు పెట్టి, తాము కూడా తిండి తిని, గట్టుమీద చెట్ల కింద కూర్చుని ఆ కబురూ, ఈ కబురూ చెప్పుకోసాగారు బళ్ళవాళ్ళు.

ఉన్నట్టుండి ఒక బండివాడు, "ఆ కుక్క చూడు!" అన్నాడు.

అందరూ అటుకేసి చూసి ఆశ్చర్య పడ్డారు. ఎందుచేతనంటే ఒక కుక్క రహదారి వెంట ఒంటరిగా పరిగెత్తుకుంటూ, అటుగాని ఇటుగాని చూడకుండా వస్తున్నది. దాని దరిదాపుల్లో ఎవరూ లేరు. సమీపంలో ఒక గ్రామం కూడా లేదు. అందుచేత అది



చాలా దూరం నుంచి వస్తూండాలి. అది వెళ్ళే తీరుచూస్తే చాలా దూరం వెళ్ళేటట్టు కూడా కనిపించింది.

"కుక్క అట్లా ఒంటరిగా ప్రయాణం చెయ్యగా ఎవరన్నా, ఎప్పుడన్నా చూశారూ?" అని ఒకరు అడిగారు.

ఆ కుక్కనే రెప్పవాల్చక చూస్తున్న వర్ధకుడు, "ఆ కుక్క తానై రావటంలేదు. ఎవరో దాన్ని పంపారు," అన్నాడు.

"ఎవరు పంపుతారు? ఎందుకు పంపుతారు?" అని మరొకరు అడిగారు.

"అదేతెలుసుకోవాలి", అన్నాడువర్ధకుడు.

వాడు ఏమి చేశాడో తెలీదు. అంత వేగంగా వస్తున్న కుక్క కాస్తా చప్పున ఆగి,

స్పృహ వచ్చిన దానిలాగా అటూ ఇటూ చూసి, వెనక్కు తిరిగి, వచ్చిన దారినే తిరిగి వెళ్ళిపోయింది.

ఒక అరగంట కల్లా ఒక మనిషి గుర్రం మీద దౌడుతీస్తూ కుక్క వెళ్ళిన వైపు నుంచి వచ్చాడు. చెరువు గట్టున మనుషులను చూసి ఆ మనిషి గుర్రం దిగి, "నా కుక్క జోలికి వచ్చిన వాళ్ళెవరు? మీ పని మీరు చూసుకోకఇతరుల వ్యవహారాలలోఎందుకు వేలు పెడతారు?" అని గదమాయించాడు.

"ఎవరినని అడుగుతావు? నీ కుక్క జోలికి మేమెవరమూ వెళ్ళలేదు," అన్నాడు వర్ధకుడు.

బళ్ళవాళ్ళు చాలా మంది ఉండటం చూసి, గుర్రం మీద వచ్చిన మనిషి కాస్త తగ్గాడు. వర్ధకుడు ఆ మనిషి చేత నిజం చెప్పించాడు. ఆ మనిషి ఒక పశువుల వైద్యుడు. ఒకటి రెండామడ మేర మరొక పశువుల వైద్యుడు లేడు. ఈ వైద్యుడికి కొన్ని శక్తులు కూడా ఉన్నాయి. ఆయన తన కుక్కను వెర్రిదానిలాగా కనపడేటట్టు చేసి, తన ఇష్టం వచ్చిన చోటికి పంపకం చెయ్యగలడు. అది ఏ మందనో చేరి ఏ పశువునో కరిచి పారిపోయి, తన యజమాని వద్దకు వచ్చేస్తుంది. పిచ్చి కుక్క కరిచిందని భయపడి వాళ్ళు ఈ పశువుల వైద్యుణ్ణి పిలిపిస్తారు. ఈయన వెళ్ళి పశువుల కుడితిలో ఏదో మందు కలిపినట్టు నటించి, "కుక్క కరిచిన పశువు చేత ఈ కుడితి తాగించండి, ఏ ప్రమాదమూ జరగదు," అని ధైర్యం చెప్పి, బోలెడంత డబ్బు పుచ్చుకుని వెళ్ళిపోతాడు. ఆ కాలంలో పిచ్చికుక్క కాటుకు మందే లేదు. కాని ఈ పశువులను కరిచేది నిజంగా పిచ్చి కుక్క కాదు గనక, పశువులకు ఏ ప్రమాదమూ ఉండేది కాదు. అయితే, ఈ పశువుల వైద్యుడు మాత్రం పిచ్చికుక్క కాటుకు నమ్మకంగా చికిత్స చెయ్యగలడని ఖ్యాతి సంపాదించాడు. అంతులేని డబ్బు కూడా గడించాడు. అటువంటి పశువుల వైద్యుడి ఆట కాస్తా వర్ధకుడి మూలంగా కట్టయిపోయింది.





# కూర్మావతారం

కృష్ణాపురం అగ్రహారంలో, విష్ణుశాస్త్రి అనే ఆయన ఇంటి పెరట్లో, తాతల కాలంనాటి బావి ఒకటున్నది. ఆ బావిలోని నీళ్ళు కంటికి కనబడనంత లోతులో వుండడం వల్ల, దాన్ని పాతాళగంగ అనేవారు. ఆ బావిలో ఎంతోకాలంగా నివసిస్తున్న తాబేలు గురించి ఎవరూ పట్టించుకోలేదు.

ప్రతి కార్తీకమాసంలోనూ, విశాలంగా వున్న విష్ణుశాస్త్రి ఇంటి పెరట్లో, నెలరోజుల పాటు పురాణకాలక్షేపం జరుగుతూండేది. ఆ సంవత్సరంకూడా భాగవత పారాయణం జరుగుతున్నది. భక్తులు గిలకబావి నుంచి నీళ్ళు తోడుకుని కాళ్ళు కడుక్కుని, పురాణ పఠనంలో కూర్చోసాగారు.

అలాంటి సమయాల్లో చాలా మంది భక్తులు, "నూతిలోకప్పలాగో, తాబేలులాగో బతికేకంటే, మంచి పండితుల బోధలు విని, ధర్మమార్గం ఏదో వివరించే పురాణాల ద్వారా జీవితాన్ని సార్థకం చేసుకోవాలి!" అని మాట్లాడుకుంటూండేవాళ్ళు.

ఇది విన్నప్పుడు, పాతాళగంగ నీటిలో వున్న తాబేలుకు ఎంతో విచారం కలిగేది. "నేను విష్ణుమూర్తి అంశ గలదాన్నంటారు. అయినా, నన్నుకూడా నూతిలో వున్నందున, కప్పలాంటిప్రాణికింద చులకనగా మాట్లాడేస్తున్నారు. నేను బయటికి పోయి, నా జన్మ సార్థకం చేసుకోవాలి!" అనుకునేది.

ఇలా వుండగా, ఒకనాడు దాని అదృష్టం పండింది. ఎవరో గిలకమీది నుంచి చేదను నూతిలోకి వేసి, ఏ కారణంచేతనో పైకి లాగకుండా వెళ్ళిపోయారు. ఇదే అదనని భావించి ఆ తాబేలు చేదలోకి చేరుకున్నది.

బయట పురాణ పండితుడు దశావతారాల ఘట్టం వివరిస్తున్నాడు. ఆ సమయంలో విష్ణుశాస్త్రి కాళ్ళు కడుక్కునేందుకు చేదను గిలకమీది నుంచి బయటికి లాగి,

జె. ఉదయనాగశిరీష



అందులో తాబేలు వుండడం చూసి, కెవ్వున కేక పెట్టాడు.

తాబేలు అదృష్టమోలేక కాకతాళీయమో-సరిగ్గా ఆ సమయంలో పండితుడు, విష్ణుమూర్తి తాల్చిన కూర్మావతారం గురించి చెబుతున్నాడు. అదే క్షణంలో తాబేలు బావి నుంచి బయటకు రావడంతో, భక్తుల్లో అలజడి బయలుదేరింది.

ఆ తాబేలు వెడల్పు సరిగ్గా అప్పడాలు ఒత్తుకునే పీట అంతవుంది. ఎత్తు ఒక పెద్ద గుమ్మడికాయంత వుంది. దాన్ని చూసి పురాణ పండితుడు తన్మయత్వంగా, "అహాఁ, కూర్మావతార ఘట్టం వినడానికి స్వయానా విష్ణువే, ఈ రూపంలో వచ్చినట్టుంది!" అంటూ తాబేలుకు భక్తిగా నమస్కరించాడు. దానితో భక్తులందరూ, "నమో భగవతే నారాయణా!" అంటూ తాబేలుకు దణ్ణాలు పెట్టసాగారు.

అంతమంది జనాన్ని చూసి భయంతో ముడుచుకుపోయిన తాబేలు, వాళ్ళుతనకు దణ్ణాలుపెడుతున్నారనితెలుసుకుని, "నేను విష్ణుమూర్తి అంశగలదానినన్న మాట!" అని గర్వంతో తలను బయటికి తీసింది.

తాబేలు తల చూడగానే, "స్వామి వారు కరుణించారు!" అంటూ భక్తులు భక్తితో గోవిందలు కొట్టసాగారు. విష్ణుశాస్త్రి పసుపు రాసిన పీట మీద తాబేలును పెట్టి, పూజా మందిరంలోకి తీసుకెళ్ళాడు. కొబ్బరి కాయలు కొట్టడం, హారతులివ్వడం వంటి వాటితో పూజా మందిరం మార్మోగిపోయింది.

అనాటి నుంచీ తాబేలుకు కూర్మావతారం అని పేరు పెట్టి, మొక్కులు మొక్కసాగారు. అగ్రహారంలో దానికి గుడి కట్టడానికి చందాలు కూడా వసూలు చేయసాగారు.

ఇంతవరకూ భక్తులిచ్చే కానుకలు తను స్వీకరిస్తున్నాడు. గుడి పేరుతో తాబేలు బయటకుపోతే, వాటికి లెక్కలు చెప్పవలసి వస్తుంది. అందుచేత బంగారుగుడ్లుపెట్టే బాతులాంటి తాబేలును వదులుకోకూడదనుకున్నాడు విష్ణుశాస్త్రి.

ఈ కారణంగా, ఒకనాడు ఆయన భార్యకు పూనకం వచ్చింది. ఆమె నిలువెల్లా ఊగిపోతూ, "ఓ భక్తాగ్రేసరులారా! నేను విష్ణుశాస్త్రి పూజా మందిరం దాటిన మరుక్షణం తనువు చాలిస్తాను. నాకు గుడి కట్టవద్దు!" అన్నది.

ఆ మాటలు కూర్మావతారం మాటలుగానే భావించి, భక్తులు గుడికట్టే ప్రయత్నాన్ని విరమించారు.

విష్ణుశాస్త్రి ఆడిన కపటనాటకం చూసి తాబేలుకు చాలా కోపం వచ్చింది. విష్ణుశాస్త్రి, తాబేలుకు దణ్ణం పెడుతూ, "ఇలాగే కనక వర్షం కురిపించావంటే, నీకు వెండి తొడుగు చేయిస్తాను," అన్నాడు.

మనుషులలో వుండే ఎక్కువ తక్కువలూ, అంటరానితనం, స్వార్థంతో కూడిన మొక్కులూ విని, వాళ్ళ నిజ స్వరూపం తెలుసుకున్నతాబేలుకు, నూతిలో జీవితమే బావున్నదనిపించ సాగింది.

మరి కొంతకాలం జరిగేసరికి, భక్తులు తాబేలుకు సమర్పించే కానుకలతో, విష్ణుశాస్త్రి మరి నాలుగెకరాల పొలం కొన్నాడు. దానితో తాబేలుమీద వచ్చే ఆదాయం విష్ణుశాస్త్రి ఒక్కడే అనుభవించడం, చాలా మందికి అసూయ కలిగించింది. వాళ్ళు అది ఉమ్మడిసొత్తని వాదించి, విష్ణుశాస్త్రిని ఆదాయం లెక్కలు చూపమన్నారు.

దీనితో విసిగిపోయిన అతడు, కూర్మావతారం అవతారం చాలించిందని నలుగురికీ చెప్పవచ్చుననుకుని, దాన్ని రహస్యంగా రాత్రివేళ తీసుకుపోయి, ఊరి చెరువులో వదిలేశాడు.

మర్నాటి ఉదయం విష్ణుశాస్త్రి భార్యకు మరొకసారి పూనకం వచ్చింది. ఆమె జుట్టు విరబోసుకుని చిందులు తొక్కుతూ, "కూర్మావతారాన్నిమాట్లాడుతున్నాను.అంతా శ్రద్ధగా వినండి! నా కారణంగా భక్తుల మధ్య కోపతాపాలూ, కలహాలూ రావడం దురదృష్టం! అందువల్ల, కొంత కాలం పాటు, మీ కంటబడకుండా వుండదలిచాను. మీ కలహాలకు స్వస్తి పలకండి," అన్నది.






# రాజుకొడుకూ-మంత్రికొడుకూ

పుష్కరావతీ నగరాన్ని ఏలే గూఢసేనుడనే రాజుకు ఒకే ఒక కొడుకుండేవాడు. అతనికి చిన్నతనం నుంచీ మంత్రికొడుకుతో గాఢ మైన స్నేహం ఉండేది. ఇద్దరూ ఒకే వయసు వాళ్ళు, ఒకే విధమైన రూపురేఖలు కలిగి ఉండేవాళ్ళు. వారి మధ్య స్నేహం ఎంతగా పెరిగిపోయిందంటే, వాళ్ళు ఒకరిని విడిచి ఒకరు క్షణం కూడా ఉండలేకపోయేవారు.

ఇలా కొంతకాలం గడిచాక రాజుకొడుకు పెళ్ళి అహిచ్ఛత్రంలో జరగటానికి నిశ్చయ మయింది. రాజుకొడుకు మంత్రికొడుకును తనతోబాటు ఏనుగుపైన ఎక్కించుకుని, పరివారంతో సహా అహిచ్ఛత్రానికి బయలు దేరాడు. సాయంకాలమయేసరికి ఇక్షుమతీ నదీతీరానికి చేరుకుని అక్కడ మజిలీ చేశారు. అక్కడ భోజనాలయ్యాక రాజు కొడుకు తన దాదిని ఏదైనా కథ చెప్పమని అడిగి, ఆమె కథ చెప్పుతూండగానే మార్గా యాసం చేత నిద్రపోయాడు. తరవాత దాది కూడా నిద్రపోయింది.

మంత్రికొడుకు మాత్రం నిద్రపోలేదు. అతనికి ఆకాశంలో ఎవరో మట్లాడుకునే మాటలు వినిపించాయి. అతను వాటిని శ్రద్ధగా ఆలకించసాగాడు. ఆ మాట్లాడు తున్నది ఎవరో దేవతాస్త్రీలని అతనికి తోచింది. వారిలో ఒకతె, "ఈ పాపిష్టివాడు కథ పూర్తి కాకుండానే నిద్రపోయాడు. అందు చేత వీడికి ఈ శాపం ఇస్తున్నాను. ఈ హారాన్ని కింద పడేస్తున్నాను. వీడు తెల్లవారి లేచి దీన్ని తీసుకుని, వెంటనే చస్తాడు," అన్నది.

"అలా చావని పక్షంలో, నది దాపుల వున్న ఆ మామిడి చెట్టు పళ్ళను చూసి, ఆశపడి కోస్తాడు. కోసి ఆ వెంటనే చస్తాడు," అన్నది మరొకతె.

"అలా కూడా చావని పక్షంలో, వీడు పెళ్ళివారింట ప్రవేశించే క్షణంలోనే ఆ

ఇంటి ముందుభాగం కూలి, మీద పడి చస్తాడు," అన్నది మూడోది.

"అలా కూడాచావుతప్పించుకున్నట్టయితే పడకటింట ప్రవేశించి నూరు తుమ్ములు తుమ్ముతాడు. వాడు తుమ్మినప్పుడల్లా ఎవరో ఒకరు 'చిరంజీవ' అనని పక్షంలో నిశ్చయంగా చస్తాడు," అన్నది నాలుగోది.

"ఈ మాటలు విన్నవాడెవడైనా వాడి ప్రాణాలు కాపాడాలని వాడితో ఈ సంగతి చెబితే వాడు కూడా చస్తాడు," అన్నది అయిదోది. ఆ తరవాత ఆ దేవతా స్త్రీలు ఆకాశ మార్గాన వెళ్ళిపోయారు.



పిడుగుపాటు లాంటి ఈ మాటలు విని మంత్రికొడుకు చాలా కలవరపడ్డాడు. రాజు కొడుకు చస్తే తను బతికి ఉండలేడు. అలా అని రాజుకొడుకుతో ఈ శాపాల మాట చెప్పి, అతనికి చావు తప్పించటానికి కూడా లేదు; అతని చావు అబద్ధమూ తన చావు నిజమూ అవుతుంది. అందుచేత తన మిత్రుడితో ఏమీ అనకుండానే తాను అతని ప్రాణాలు కాపాడాలని మంత్రి కొడుకు నిశ్చయించుకున్నాడు. ఆ రాత్రి అతనికి కన్ను మూతపడనేలేదు.

తెల్లవారింది. అందరూ బయలుదేరారు. రాజుకొడుకుకు నేలమీద ఏదో హారం కనబడింది. అతను దాన్ని తీసుకోబోతూ ఉంటే మంత్రికొడుకు అడ్డుపడి, "దాన్ని తాకకు. అదేదో మాయాహారం లాగుంది. కాని పక్షంలో దాన్ని మన సైనికులలో ఎవడో ఒకడు చూసి, ఎప్పుడో తీసుకుని ఉండేవాడు," అన్నాడు. ప్రాణమిత్రుడి మాట తీసెయ్యక రాజుకొడుకు ఆ హారాన్ని వదిలేశాడు.

కొంచెం దూరం వెళ్ళేసరికల్లా పళ్ళతో నిండిన మామిడిచెట్టు కనబడింది. రాజు కొడుకు ఆ మామిడిపళ్ళను కొయ్య బోయాడు. "మిత్రమా, వాటిని తాకకు, అవి తినదగిన పళ్ళయితే ఈ అరణ్యంలో ఉండే కోతులు వాటిని ఎప్పుడో కొరికేసేవి," అన్నాడు మంత్రికొడుకు. అంత చక్కని మామిడిపళ్ళను వదిలెయ్యటం బాధగానే ఉన్నా రాజుకొడుకు స్నేహితుడి సలహాను

పాటించి,వాటినికొయ్యకుండానేముందుకు సాగాడు.

తరవాత రాజుకొడుకు అహిచ్ఛత్రపురం చేరి, పెళ్ళివారింట ప్రవేశించబోతూండగా మంత్రికొడుకు అతన్ని వెనక్కు లాగేశాడు. ఆ క్షణంలోనే ఆ ఇంటి ముందుభాగం కప్పు కూలింది.

ఎలాగో పెళ్ళి జరిగిపోయింది. ఆ రాత్రి రాజుకొడుకు పడకగదికి వెళ్ళాడు. మంత్రి కొడుకు ముందుగానే ఆ గదిలో ప్రవేశించి దాగి ఉన్నాడు. రాజుకొడుకు పక్కమీద నడుమువాల్చుతూనే తుమ్మనారంభించాడు. అతను వరసగా నూరుసార్లు తుమ్మాడు. ప్రతి సారీ మంత్రికొడుకు 'చిరంజీవ' అన్నాడు. నూరుసార్లూ అలా 'చిరంజీవ' అన్న మీదట మంత్రికొడుక్కు పరమానందమయింది. అతను తాను దాగి ఉన్న చోటి నుంచి పైకి వచ్చి, రాజుకొడుకు చూస్తూండగానే ఆ గది నుంచి బయటికి వెళ్ళిపోయాడు.

రాజుకొడుకు అది చూసి ఈర్ష్య చెంది, తమ మధ్య ఉండే స్నేహం కూడా పాటించక, ద్వారపాలకులను పిలిచి, "నా పడక గది ప్రవేశించిన ఆ దుర్మార్గుణ్ణి పట్టి బంధించండి. తెల్లవారగానే వధించండి," అని ఉత్తరు విచ్చాడు.

రాజభటులు మంత్రికొడుకునుతెల్లవార్లూ నిర్బంధంలో ఉంచి, తెల్లవారగానే అతనితో సహావధ్యభూమికిబయలుదేరారు. అప్పుడు మంత్రికొడుకు వాళ్ళతో, "నన్ను ముందుగా ఒకసారి రాజుకొడుకు వద్దకు తీసుకు పోండి, నేనతనితో ఒకమాట చెప్పాలి. ఆ తరవాత నన్ను వధింతురు గాని," అన్నాడు.

అతను ఇలా అంటున్నాడని వాళ్ళు వెళ్ళి రాజుకొడుకుతో చెప్పారు. అతని మంత్రులు కూడా మంత్రికొడుకు చెప్పేది వినమని చెప్పారు. రాజుకొడుకు మంత్రికొడుకును పిలిపించి, అతని నోట జరిగిన సంగతంతా విన్నాడు. ఇల్లు కూలిపడటం ఒకటి ప్రత్యక్షంగా కనబడటంచేత మిగిలినవి కూడా తప్పక నిజమే అయి ఉంటాయనుకుని, మంత్రి కొడుకును క్షమించి, అతనితో ఎప్పటిలాగే స్నేహంగా ఉన్నాడు.



ప్రకృతి వింతలు :

### విషపూరితాలయిన కప్పలు !




దక్షిణ అమెరికా అడవులలో వింత వింత రంగులతో కొన్ని అందమైన కప్పలు ఉన్నాయి. అయితే వీటిశరీరాలువిషపూరితాలు. మామూలుగా ఎరుపు, పసుపు రంగులలో ఎక్కువగా కనిపించే ఈ కప్పల శరీరాలమీద నల్లటిమచ్చలు, చారలు ఉంటాయి. ఈ రంగుల కారణంగా ఇవి పరిసరాలతో కలిసిపోయి, శత్రువులకు కనిపించకుండా తమను తాము రక్షించుకుంటాయి. వీటి శరీరంలో చర్మం అడుగున లభించే విషాన్ని ఆటవికులు, బాణం మొనకు పట్టించి వేటాడతారు. బాణాలు జంతువులకు తగలగానే మత్తులో నడవలేక సొమ్మసిల్లి పడిపోతాయి.

### చేపల శ్వాసక్రియ




ఈతగాళ్ళలా చేపలు గాలి పీల్చుకోవడానికి నీళ్ళ ఉపరితలానికి రావలసిన అవసరంలేదు. నీళ్ళ నుంచి ప్రాణవాయువును వేరుచేసే 'గిల్స్' అనే ప్రత్యేక శ్వాసేంద్రియాలు వాటికి ఉన్నాయి. చేపలు మొదట నీళ్ళను నోట్లోకి తీసుకుని, శ్వాసేంద్రియాలకు పంపుతాయి. అక్కడ ప్రాణవాయువు గ్రహించబడి, నీళ్ళు తలకు వెనకగా ఉన్న దొప్పల గుండా వెలుపలికి వచ్చేస్తాయి. శ్వాసేంద్రియాలలోని సూక్ష్మమైన రక్తనాళాలు, ప్రాణవాయువును గ్రహించి, రక్తంగుండా శరీరంలోని ఇతర భాగాలకు అందే విధంగా చేస్తాయి.

### అతి పురాతనం!




నాలుగేళ్ళ క్రితం ఆస్ట్రేలియాలోని మెల్‌బోర్న్ సమీపంలో ఒక సకోశబీజ శిలాజం బయటపడింది. అమెరికా యేల్ విశ్వవిద్యాలయానికి చెందిన శాస్త్రవేత్తలు ఎంతో పరిశోధించి, అది 'కూన్‌వారా' జాతికి చెందిన నల్లమిరియాల వంటి మొక్క శిలాజమనీ, అది దాదాపు 12 కోట్ల సంవత్సరాలకు పూర్వంనాటిదనీ అభిప్రాయం వెలిబుచ్చారు. దాని మీద ఒక పువ్వూ రెండు ఆకులూ కనిపించాయి.

“ఇప్పుడు నీకు నేను <u>మమ బేర్</u>
పాప బేర్ చెబుతాను”.



మీ బిడ్డ, అమ్మ మమ బేర్ బొమ్మ
మీరు మీ బిడ్డను, బొమ్మను విడదీయలేరు.

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1993 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

※ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ※ ఫిబ్రవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ※ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ※ వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 26.

---

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : లోకం చదివిన వయసు! రెండవ ఫోటో : మోసం తెలియని మనసు!

పంపినవారు : బొబ్బిలి శ్రీనివాసరావు, గోదావరి హెడ్‌వర్క్స్ డివిజన్, ధవళేశ్వరం - 533 125 తూ.గో.జిల్లా (అం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**


---

